**TATAKA**

Novel

by **Bejjarapu Ravinder**

Cell : 95154 24104

e-mail: ravibej2016@gmail.com



| | | |
|---|---|---|
| Cover Design | : | Brahmam Bhavana Grafix<br>Hyderabad@9848254745 |
| First Edition | : | January 2017 |
| For Copies | : | Palapitta Books<br>Flat No: 2, Block-6<br>MIG-II, APHB<br>Baghlingampally<br>Hyderabad-500 040<br>palapittabooks@gmail.com<br>Phone: 040-2767 8430 |
| Printed at | : | Karshak Art Printers<br>Vidyanagar<br>Hyderabad |
| Price | : | Rs. 80 |

# ఒకమాట

కాల్పనికత, చరిత్రల సమ్మేళనంగా రూపొందిన పురాగాథల పునర్విశ్లేషణ, పున:సృజన ఈ కాలపు లక్షణం. మూలాల్లోకి వెళుతున్న కొద్దీ అసలు వాస్తవాలు తెలుస్తుంటాయి. క్లాసిక్స్‌గా ప్రసిద్ధి చెందిన భారత రామాయాణాల్లోని కొన్ని పాత్రల వైశిష్ట్యం కొత్త అర్థాలతో బోధపడుతుంది. ఈ నేపథ్యంలోనే రామాయణం లోని 'తాటక' వృత్తాంతాన్ని బెజ్జారపు రవీందర్ ఒక నవలగా సృజించారు. తాటకని చంపడం రాముడు చేసిన మొదటి హత్య. తమ వనాల్లో తమదైన రీతిన బతుకుతున్న అటవిక జాతుల హననానికి మునులు ఎందుకు పాల్పడ్డారు? దీనికి సంబంధించిన పూర్వాపరాల్ని సంయమనంతో, కడు ఆసక్తికరంగా రాయడం రవీందర్ కథన కౌశలంలోని ప్రత్యేకత. నాగరికతల పేరిట అటవీ ప్రాంతాల్లోకి చొచ్చుకు వస్తూ, అంతులేని మానవ హననానికి పాల్పడిన ఆర్యుల అసలు స్వరూపాన్ని కళ్ళకు కట్టినట్టు దర్శింపజేస్తుందీ నవల. లోకాయతవాదం, సురులు, అసురుల గురించిన చర్చకు మరో సృజనాత్మక చేర్పు ఈ నవల. మా ఇతర ప్రచురణల మాదిరిగానే ఈ నవలని పాఠకులు సమాదరిస్తారని ఆశిస్తున్నాం.

**– పాలపిట్ట బుక్స్**

# నేపథ్యం

తాటకకు సంబంధించిన మొదటి జ్ఞాపకం నా బాల్యంతో ముడిపడి ఉంది. మారుమూల ప్రాంతమైన మా రాయికల్‌లో దసరా పండుగ రోజుల్లో రాముడు, లక్ష్మణుడు, సీత, హన్మంతుడు వేషాలతో ఊరేగింపు వచ్చేది. వాళ్ళతో పాటు తాటక వేషధారి ఉండేవాడు. ఒళ్ళంతా నలుపు రంగు పులుముకుని, నోటికి ఇరువైపులా నిమ్మకాయలు, ఎర్రటి కృత్రిమ నాలుక, భారీ కృత్రిమ స్తనాలు, పిరుదులు, కాళ్ళకు గజ్జెలతో భయానకంగా ఉండేవాడు. తెలుగు సినిమాల్లో కూడా అట్లాంటి వేషాలే కనపడేవి. తాటక అనగానే అదే రూపం మనసులో కదలాడుతుంది.

డి.డి.కోశాంబిని చదవడం మొదలు పెట్టాక నా దృక్పథంలో పెనుమార్పు వచ్చింది. ఇతిహాసాల్లోంచి, పురాణాల్లోంచి అతీంద్రియ శక్తుల్ని వడకట్టి కేవలం చరిత్రగా వాస్తవాల్ని మాత్రమే గ్రహించడానికి ప్రాతిపదిక దొరికింది. రాహూల్ సాంకృత్యాయన్ రచనలు చారిత్రక కాల్పనిక సాహిత్యం పట్ల అభిరుచిని పెంచాయి. డా. బి.ఆర్.అంబేద్కర్ రచనలు, త్రిపురనేని సూతపురాణం నన్ను ప్రభావితం చేశాయి.

ఆరేళ్ళ కిందటే రామాయణంలో కనిపించే చారిత్రక పరిణామాల నేపథ్యాన్ని మొత్తంగా గానీ, కొంత భాగాన్ని గానీ చారిత్రక కోణం

నుండి ఎందుకు రాయకూడదనిపించింది. సురవరం ప్రతాపరెడ్డి 'రామాయణ విశేషములు' నన్ను తాటక ఇతివృత్తం రాయడానికి పురికొల్పింది.

మళ్ళీ అధ్యయనం మొదలుపెట్టాను. వాల్మీకి విరచిత రామాయణం (గీతాప్రెస్, గోరఖ్‌పూర్) తోపాటు చాలా రామాయణాలు చదివాను. అందులోని బాలకాండను వందలసార్లు చదివాను.

వాల్మీకి అద్భుత రచనా కౌశలానికి ఎన్నిసార్లు ముగ్ధుణ్నయ్యానో! ఇప్పటికీ రామాయణ, మహాభారత కథల్లోని ఎత్తుగడలు, వర్ణనలు, మలుపులు మనసుని కట్టిపడేస్తాయి. ఇది ఒక పార్శ్వమైతే, రామాయణ, భారత భాగవతాలు అనేక చారిత్రక పరిణామాల్ని సూచిస్తాయి. తాటక హత్య (వధ?) రాజకీయ, ఆర్థిక, సామాజిక పరిణామాల్ని సూచిస్తుంది. అదే నా కథాంశం.

ఆదిమ స్థానిక తెగలకు, అప్పుడప్పుడే ఊపందుకుంటు విస్తరిస్తున్న వ్యవసాయం, లోహ పరిజ్ఞానంతో నూతన పరికరాలు, ఆయుధాలు సమకూర్చుకుంటూ నాగరికులమని చెప్పుకొనే వర్గానికి మధ్య జరిగిన ఘర్షణలు అనాది కాలం నుండి బహుశా ఇప్పటివరకు జరుగుతూనే ఉన్నాయి. అయితే అది చాలా సార్లు ఇరువర్గాలు కొంత రాజీపడడం, కొద్దిపాటి బలప్రయోగంతో సామరస్యం ఏర్పడేది. ఒక్కోసారి అత్యంత కర్కశంగా వ్యవహారం ఉండేది.

వాల్మీకి రామాయణం ప్రకారమైనా తాటక హత్య అత్యంత క్రూరంగా పాశవికంగా ఉంటుంది. దీనిలో చాలా విశేషాలు ఉన్నాయి. విశ్వామిత్రుడు పదహారేండ్లు కూడా నిండని, అస్త్రవిద్యలు పూర్తిగా నేర్వని రామలక్ష్మణులనే బాలుర్ని ఉసిగొల్పి ఈ హత్య చేయిస్తాడు. రాముని

చేతిలో మరణించిన మొదటి వ్యక్తి తాటక. దశరథుని సభలో విశ్వామిత్రుడు మారీచ సుబాహుల నుంచి యాగాన్ని రక్షించడానికి రామలక్ష్మణుల పంపమంటాడు. ఎక్కడా తాటక ప్రస్తావన రానీయకుండా జాగ్రత్త పడతాడు. గతంలో తాటక భర్త సుందుడు అగస్త్యుని చేతిలో మరణిస్తాడు. కారణం ఏమిటో ఎక్కడా చెప్పరు. ఉత్తర భారతదేశంలోని సరయూ నదీతీరం, సరయూ గంగల సంగమం దాటి మలద కరూశాలని చెప్పబడే తాటకవనం, సిద్ధాశ్రమం... ఇవి కథా స్థలాలు. ప్రస్తుతం ఫైజాబాద్, ఘజియాబాద్, బక్సర్‌గా పిలువబడే ప్రాంతాలు అయోధ్య నుండి తాటకవనం వైపు విశ్వామిత్ర రామలక్ష్మణ ప్రయాణమార్గాలుగా గుర్తించారు.

సురవరం ప్రతాపరెడ్డి 'రామాయణ విశేషములు' పుస్తకంలో ప్రస్తావించిన పెండ్యాల వెంకట సుబ్రహ్మణ్యశాస్త్రి గారి 'భారత విమర్శనము' గ్రంథం అదృష్టవశాత్తు కరీంనగర్ గ్రంథాలయంలో కనిపించింది. ఆ కాలంలో మహాభారతం మీద చారిత్రక దృక్కోణంతో బలమైన విమర్శనాత్మక వ్యాసాలు రాసిన వారి సాహసానికి ఆశ్చర్య పోయాను. అదే సమయంలో 'సంస్కృత వాఙ్మయ చరిత్ర', రాహూల్ సాంకృత్యాయన్ రాసిన 'ఋగ్వేద ఆర్యులు' చాలా సమాచారాన్ని ఇచ్చింది. లోకాయత వాదం మీద వచ్చిన పుస్తకాలు, ఇంటర్‌నెట్‌లో లభ్యమవుతున్న ఆర్కియాలజికల్ రిపోర్టులు, శ్యాం బెనెగల్ తీసిన 'భారత్ ఏక్ ఖోజ్' (నెహ్రూ డిస్కవరీ ఆఫ్ ఇండియా) సీరియల్, చరిత్ర పాఠ్యగ్రంథాలు... ఇవన్నీ ఈ చిన్ని నవల రూపకల్పనలో ఎంతో ఉపయోగపడ్డాయి.

ఇవన్నీ ఒక ఎత్తయితే తాటక నవల రచనకు ఉపకరించిన

మరో రెండు ముఖ్యమైన పుస్తకాలు పేర్కొనాలి. ఐదేళ్ళ కిందట బైరప్ప రాసిన 'పర్వ' నవల చదవడం తటస్థించింది. అది నన్ను ఒక ఊపు ఊపేసింది. అత్యద్భుతమైన నవల. అదొక మార్గదర్శి నాకు. మరొక పుస్తకం డా॥ విజయభారతి గారి 'వ్యవస్థను కాపాడిన రాముడు'. వారి కృషి అమోఘం. రామాయణం ఆమూలాగ్రాన్ని కొత్త కోణంలో ఆవిష్కరించారు. ఇక నేను ఎక్కువగా కష్టపడవలసిన అవసరం కలగలేదు. రాయడం ప్రారంభించిన మూడు సంవత్సరాలలో రెండుసార్లు తిరగరాశాను. రాయడం ముగించిన తరువాత చిన్న చిన్న మార్పులు చేస్తుంటే ఆర్నెల్లు గడిచాయి.

ఈ నవల రాయడానికి చాలా శ్రమపడిన మాట వాస్తవం. మానసికంగా ఎంతో ఒత్తిడికి గురయ్యేవాడిని. తాటక అనగానే భయానక, భీకర ఆకారం స్థానంలో సాహసవంతురాలైన యోధ, హత్య జరిగే నాటికి శతాధిక వృద్ధురాలిగా ఆమెను నా ఊహల్లో స్థాపన చేసుకోవడానికి చాలా కాలం పట్టింది.

నా మార్గాన్ని సుగమం చేసిన పూర్వ జిజ్ఞాసువులకు, తాత్త్వికులకు, కవులకు శిరస్సు వంచి నమస్కరిస్తున్నాను. ఈ నవల రచనలో సహకరించిన పెద్దలకు, మిత్రులకు, కుటుంబ సభ్యులకు కృతజ్ఞతలు.

నేను రాసినది మాత్రమే వాస్తవం అని అనుకోవడం లేదు. వేల ఏళ్ళ నాటి కథాంశం. కాల్పనికత అనివార్యం. కాని సత్యానికి దగ్గరగా వెళ్ళగలిగాననే నమ్మకం మాత్రం ఉంది.

*– బెజ్జారపు రవీందర్*

## - 1 -

మలద కరూశాలు రెండూ గోబ్రాహ్మణులతో కిటకిట లాడు తున్నాయి. పశువుల మందలను కాస్త దూరంలో పెట్టారు. గుర్రాల సకిలింపులు, గోవుల అంబారావాలతో మనుషుల అరుపులు కలిసి మహా కోలాహలంగా ఉంది అక్కడ.

యాగశాల నిర్మాణం దాదాపుగా పూర్తయింది. యూప స్తంబాలను నిలబెడుతున్నారు. ప్రధాన యజ్ఞవాటిక నిర్మాణం ఇతర ఏర్పాట్ల పట్ల ఋత్విక్కులు సంతృప్తి చెందారు. వాటిని పర్యవేక్షిస్తున్న కౌపాయనుడిని ప్రశంసించారు. వెలిగిపోతున్న ముఖంతో అతడు యాగశాల నుండి బయటకు వచ్చి పశువుల మందవైపు నడవసాగాడు. కొంత దూరంలో పచ్చి గడ్డిని మోపులుగా కడుతున్న లోచనుడు, అష్టకుడు కనపడ్డారు. కోసిన పచ్చిగడ్డి వాసన ముక్కుపుటాలకు తాకింది.

“తండ్రీ కొడుకులిద్దరు కలిసి పనిచేస్తుండడాన్ని చూసి ఎన్నాళ్ళ యింది!” అన్నాడు కౌపాయనుడు సంతోషం ధ్వనిస్తున్న గొంతుతో.

“నీ మాటలకేమిటిలే, పెత్తనం చేసేవాడెప్పుడూ సరదాగానే మాట్లాడుతాడు. చాకిరి చేసేవాడికి వస్తుంది చావు” అన్నాడు లోచనుడు నవ్వుతూ.

కౌపాయనుడు లోచనుని కొడుకు అష్టకుని వంక చూశాడు. నూనుగు మీసాలతో అష్టకుని ముఖం కొత్తగా కనిపించింది. లేత ముఖానికి మీసాలు అతికించినట్లుగా అనిపించింది.

"మేతకు లోటు లేదు కదా?" అడిగాడు కౌపాయనుడు, లోచనుడి చేతిలోని గడ్డిమోపును లాక్కుంటూ. లోచనుడు దీర్ఘంగా నిట్టూరుస్తూ చుట్టూ చూశాడు. విస్తారమైన అరణ్యం. పశువుల మేతకు కొదువ లేదు.

"ఈ పచ్చదనం ఎంతటి ఆకలియనయినా, ఎంతకాలమైనా తీర్చగలదు" అన్నాడు లోచనుడు.

"అందుకే కదా, ఇంద్రుడు ఈ ప్రాంతానికి వచ్చి స్వస్థత పొందాడు. మనో శారీరక మాలిన్యాన్ని పోగొట్టి శుద్ధి చేయగల స్వచ్ఛమైన గాలి, నీరు, ఔషధమొక్కలు... జిహ్వా చాపల్యాన్ని సంతృప్తిపరచగల రకరకాల కందమూలాలు, ఫలాలు, జంతువులు... ఓహోహో... మలద కరూశాలని ఎంత గొప్పగా పేరు పెట్టాడు ఇంద్రుడు! మాలిన్యాన్ని పోగొడుతుంది కాబట్టి మలదమని, ఆకలిని తీరుస్తుంది కాబట్టి కరూశమని!..." మురిసిపోయాడు కౌపాయనుడు.

లోచనుడు, కౌపాయనుడు ఇద్దరు కలిసి ఆ ఆవరణ దాటి కొంత దూరం వెళ్ళి విశ్రాంతిగా కూర్చున్నారు. అడవిలో కొంత భాగం కొట్టివేసి శుభ్రపరిచారు. అయినా సరిపోవడం లేదు. అగ్ని కార్యం నెరవేర్చడానికి అన్ని ఏర్పాట్లు చేయబడ్డాయి. సరయూ తీర ప్రాంతాల నుండి యాగనిపుణులు వచ్చారు. వారందిరికి బస ఏర్పాట్లు చేశారు. చుట్టూ దడి కట్టి ఉన్న చిన్న ప్రాంతంలో సంవత్సరాలు గా నివసిస్తున్న మునులు తమ వసారాల్లో, కుటీరాల్లో ఇతరులకు చోటు కల్పించారు.

యాగ పశువుల సంరక్షణ కొరకు ప్రత్యేక ఏర్పాట్లు చేయబడ్డాయి. దీని నిర్వహణ అంతటిని చూస్తున్నవాడు లోచనుడు. వయసు మీరుతున్న లక్షణాలు అతడిలో ఇప్పుడిప్పుడే కనపడుతున్నాయి.

పశుపోషణలో లోచనుడు దిట్ట. వాటి హృదయం తెలిసినవాడు. రోగాలకు మందూమాకు తెలసినవాడు.

పశువుల మందవైపు చూస్తున్న లోచనుడికి, ఒకచోట పశువుల సంఖ్య ఎక్కువగా ఉండి తొక్కిడి తొక్కిడిగా ఉందనిపించింది. పక్కనే ఉన్న కొంత నేలను చదును చేస్తే బాగుంటుందనిపించింది. తన సహాయకులిద్దరిని కేకేసి పిలిచాడు.

గొడ్డలిని చేతిలోనికి తీసుకున్నాడు. అతని మనసు పులకరించింది. ఇనుమును సాగదీసి పిడి అమర్చి ఉన్న గొడ్డలి అతనికెప్పుడూ ప్రియమైనదే. కాంస్యంతో చేసిన పరికరాల గురించి తన ముత్తాత చెప్తుండేవాడు. సానబెట్టినప్పుడు ఇనుముకు వచ్చే పదును, గట్టిదనం, బలం ముందర ఏ లోహం పనికి రాదు.

ఇక్కడి సమీపంలోని కొన్ని అనాగరిక తెగలు ఇనుప లోహాన్ని తమ నివాసాల్లోకి అనుమతించరు. 'అరిష్టం' అంటారు దురదృష్టాన్ని వెంట తీసుకువస్తుందంటారు.

'నిజమే, ఇది మీ పాలిటి దురదృష్టమే, శాపమే. కాని మేం దీన్ని సదా మా వెంట ఉంచుకుంటాం. ఇంద్రుని వరం ఇది' అనుకున్నాడు లోచనుడు.

ఇరువురు సహాయకులతో కలిసి కొద్ది దూరంలో నేలను చదును చేయడానికి పూనుకున్నాడు. వాళ్ళిద్దరు చిన్న చిన్న మొక్కల్ని కొట్టివేస్తుంటే లోచనుడు అడ్డుగా ఉన్న వృక్షాల కొమ్మల్ని నరకసాగాడు.

అంతలోనే అక్కడికి అష్టకుడు వచ్చాడు. "చాలా అలసిపోయారు. ఆ పరుశువును ఇటివ్వండి. కాస్త విశ్రాంతి తీసుకుందురుగానీ" అంటూ తండ్రి చేతుల్లోంచి గొడ్డలిని తీసుకున్నాడు అష్టకుడు.

కొడుకు వంక చూశాడు లోచనుడు. విశ్వామిత్రుని కొడుకు పేరు కూడా అష్టకుడేనట! అప్పుడు తనకావిషయం తెలియదు.

దూరంగా వెళ్ళి కౌపాయనుడి పక్కనే కూర్చున్నాడు. అతడి ఆలోచనలు అష్టకుని చుట్టే తిరుగుతున్నాయి. తల్లి లేని పిల్లవాడనే గారాబంతో వాడిని మరీ కట్టడి చేస్తున్నాడు తాను. అయినా స్వేచ్ఛగా విహారించే వాడి అలవాటును, విభిన్నంగా ఆలోచిస్తు నిర్భీతిగా వ్యక్తం చేసే తెగువను నిరోధించలేక పోతున్నాడు. అదే కదా తన ఆందోళనా!.

అష్టకుడిలో తనను విభేదించే అంశమేదో అస్పష్టంగా కనపడు తోంది. వీడితో కొంచెం ఎక్కువసేపు మాట్లాడితే చార్వాకులతో మట్లాడిన ట్లుంటుంది. తను సహిస్తాడు. ఇతర ఋషిపుంగవులతో ఇలాగే మాట్లా డితే, వారి కార్యకలాపాలను హేళన చేస్తే, అడ్డువస్తే వారు ఊరుకుంటా రా? బ్రహ్మరాక్షసునిగా కమ్మని శపిస్తారు. వేదాలను ఉపాసించిన తను, నిష్ఠగా కుమారునికి అభ్యాసం గరపడానికి ప్రయత్నిస్తూనే ఉన్నాడు. నేర్చుకోవడంలో అష్టకుడు ఇతరులకేమి తీసిపోడు. ఇంత విద్యనభ్యసించి బ్రహ్మరాక్షసునిగా బ్రతకాల్సి వస్తే... ఊహించలేక పోయాడు. సమాజం నుండి బహిష్కరింపబడి వేషధారణ మార్చుకొని హక్కుల్ని కోల్పోయి క్షత్రియేతర, బ్రాహ్మణేతరులతో కలిసి బతకాల్సి వస్తుంది. అంతకన్న హీనమైన స్థితి ఉంటుందా? కాని ఇప్పుడు ఇలాంటి బహిష్కృతుల సంఖ్యే ఎక్కువగా ఉండేటట్లుంది.

కొంత సేపటి తర్వాత తండ్రి పక్కనే కూర్చున్నాడు అష్టకుడు.

స్వేదంతో అతని నారవస్త్రాలు తడిసిపోయాయి. ఇంతలో పాలు తాగడం పూర్తయిన లేగదూడ ఒకటి అష్టకున్ని వెతుక్కుంటూ వచ్చింది. దానిని చేతుల్లోకి తీసుకొని మురిసిపోయాడు. ఒళ్ళంతా తడుముతూ మెడను నిమురుతూ చెవిదగ్గర ముద్దాడాడు.

"అష్టకుడేమిటో లేగదూడతో గుస గుసలాలడుతున్నాడు" అంటూ పరాచిక మాడాడు కౌపాయనుడు.

"దీన్ని ఆశీర్వదిస్తున్నాను" అన్నాడు అష్టకుడు లేగదూడను ఇంకా ముద్దు చేస్తూనే.

లోచనుడు లేగదూడ వైపు, అష్టకుడివైపు మురిపెంగ చూస్తూ ఆ సంభాషణను ఆనందిస్తున్నాడు.

కొంత విరామం తర్వాత

"ఏమిటా ఆశీర్వాదం అష్టకా?" అంటూ ప్రశ్నించాడు కౌపాయనుడు. అష్టకుడేమి మాట్లాడలేదు.

"ఏమిటి అంత రహస్యమైన ఆశీర్వాదం?" అంటూ తిరిగి ప్రశ్నించాడు కౌపాయనుడు చిరునవ్వుతో.

అష్టకుడి ముఖం గంభీరంగా మారిపోయింది.

"యజ్ఞ పశువుగా మారకు, అని ఆశీర్వదిస్తున్నాను" అన్నాడు అష్టకుడు.

కౌపాయనుడు లోచనుడు ఒకరి ముఖం ఒకరు చూసుకున్నారు. లోచనుడు ముఖం ముడుచుకున్నాడు. కౌపాయనుడు కృత్రిమమైన నవ్వుతో.

"ఇన్ని సంవత్సరాల వేదాభ్యాసం, ఇంతమంది జ్ఞానసంపన్నుల సాంగత్యం... అయినా నువ్వు మారలేదురా" అన్నాడు.

"అవునా? నేను మారడం పక్కన పెట్టండి... యజ్ఞవాటిక దగ్గర చూడండి. యూపస్తంభాలకు ఎన్ని రకాల పశువుల్ని, పక్షుల్ని, పాముల్ని బంధించారో! ఎందుకీ అకారణమైన ఆహుతులు... ఏ యూపస్తంభానికి ఎవడినైనా మనిషిని కట్టివేయడం చూస్తానేమోనని మొన్నటి నుండి భయపడి చస్తున్నా..." అంటూ ఇంకా ఏదో మాట్లాడబోతున్న అష్టకుడి వాక్ప్రవాహానికి రౌద్రంతో లోచనుడు అడ్డుపడ్డాడు.

"ఇక చాలు... వాగుడు కట్టిపెట్టు. క్రతునిర్వాహణ తెలుసుకొని ఏదో ఉద్ధరిస్తావనుకుంటే, యాగాల్ని విమర్శిస్తూ పాపాల్ని నెత్తిన మూటకట్టుకుంటున్నావు. పరమప్రామాణికాల్నే తప్పుపడతావా? నీ వయసేమిటి, నీ స్థాయి ఏమిటి, నీలాంటి వాళ్ళు ఈ మధ్య బాగా పెరిగిపోయారు. పాతవాటిని రోత అనడం గొప్పనుకుంటున్నావా? నోర్మూసుకొని ఉండు" తీవ్రస్వరంతో కోప్పడ్డాడు లోచనుడు.

అష్టకుడి కళ్ళలో నీళ్ళు తిరిగాయి. తలవంచుకుని అలాగే కూర్చుకున్నాడు. లోచనుడు చేతులు జోడిస్తూ.

"నీవు ఏ పని చేయకున్నా నష్టం లేదు. దయచేసి ఈ వాగుడు మాత్రం కట్టిపెట్టు" అంటూ విసవిసా నడుస్తూ వెళ్ళిపోయాడు.

"నిన్ను ప్రాణం లాగా కనిపెట్టుకుని ఉండే కన్నతండ్రిని ఎందుకురా బాధపెడతావు" అంటూ వెళ్ళిపోయాడు కౌపాయనుడు.

***

## – 2 –

లోచనుడు దగ్గరలో ఉన్న సెలయేరు వద్దకు వెళ్ళి ముఖం కాళ్ళు చేతులు కడుక్కొన్నాడు. దోసిలితో నీళ్ళను తాగాడు. ఒడ్డున కొంత దూరంలో కూర్చున్నాడు. మెల్లమెల్లగా అతని మనసు స్థిమితపడింది.

లోచనుడికి కొడుకంటే ప్రాణం. తల్లిలేని పిల్లవాడని తాను చేసిన గారాబమే వాడిని చెడగొట్టిందని బాధపడుతుంటాడు. అష్టకుడి భవిష్యత్తుకు సంబంధించిన ఏదో భయం అతన్ని వెంటాడుతూనే ఉంది. దానికి మూలాలు వాడి తల్లి రక్తంలోనే ఉన్నాయి. వాడి తల్లి పూర్వీకుల్లో అనార్య రక్తం కలిసి ఉంది. అంతే కాకుండా అయిదేళ్ళ కిందట జరిగిన ఒక సంఘటన అష్టకుడిలో మార్పుకు బీజం వేసిందను కున్నాడు లోచనుడు. బహుశా అప్పుడు వాడికి మందో, మాకో, మాయనో, మంత్రమో తగిలి ఉంటుంది.

పశువుల్ని మేతకు తీసుకవెళ్ళేటప్పుడు అష్టకుడు తనతో పాటు వచ్చేవాడు. తమ ఆశ్రమం అప్పుడప్పుడే వృద్ధిలోకి వస్తూ ఉంది. మలద కరూశాల ప్రశస్తి సరయూ అవతల కూడా వినిపిస్తోంది.

విస్తారమైన అడవి, అడవిని కొట్టేసి అప్పుడప్పుడే వ్యాప్తిలోకి వస్తున్న నాగలితో చిన్న చిన్న కమతాలు ఏర్పాటు చేసుకోవడానికి కండగల భూమి, పుష్కలమైన నీరు, మేలైన కలప... దేనికీ కొదువ లేదు. ఆర్యగణాలకు యోగ్యమైన భూమి ఇది.

ఒక్కటే సమస్య. అటవీ జాతులు. ఈ ప్రాంతంలో అసురుల సంచారం ఎక్కువ. ఈ అసురులెవరు? వర్ణసంకరం ఎక్కువై అటవీ జాతుల్లో ఉన్న యక్ష, నాగ, రాక్షసులను విడిగా పోల్చడం కష్టమై పోతున్నది.

తమ గురువు చెప్పిన దాని ప్రకారం 'ఇంద్రపూజ చేయనివాడు, అగ్నికార్యం నెరవేర్చనివాడు ఆర్యుడైనా, ఆర్యేతరుడైనా అసురుడే'.

ఈ అటవీ జాతులు నరమాంస భక్షకులు. ఈ ప్రస్తావన వస్తే అష్టకుడు నవ్వుతాడు. అయిదేళ్ళ కిందటి సంఘటన తర్వాత తానూ సంశయంలో పడ్డాడు. కాని ఆర్యేతర జాతుల పట్ల తనకున్న అసహ్యం తగ్గలేదు.

ఈ ప్రాంతమంత యక్షులు, నాగుల ఆధీనములో ఉంది. అర్యావర్తంలో జనాభా పెరిగిపోయి దిగువ ప్రాంతాలకు వలసలు మొదలయ్యాయి. ఎక్కడికక్కడ మార్గాన్ని సుగమం చేసింది అగస్త్యుల వారు. పరిమితమైన శిష్యబృందంతో ధైర్యంగా అడవి లోతట్టు ప్రాంతాల్లోకి వెళ్ళి ఆశ్రమాలు ఏర్పాటు చేసేవాడు. అక్కడున్న అసురుల్ని తన తపశ్శక్తితో లొంగదీసేవాడు. ధూర్తులైన అసురుల్ని తన తపశ్శక్తితో పరిమార్చేవాడు.

ప్రతిదానిలోను తప్పులు వెతికే చార్వాకులు మాత్రం అగస్త్యుల వారి శక్తి సామర్థ్యాలను హేళన చేస్తుంటారు. "తపశ్శక్తా పాడా! చిన్న

చిన్న తెగల్ని నయానో, భయానో లొంగదీస్తాడు. అవసరమైతే ఆయుధాలతో హతమారుస్తాడు. నోటి తుంపర్లకో, కమండలంలోని నీటి చుక్కలకో చస్తారా ఏమిటిజనం!” అంటూ ఎకసెక్కమాడతారు.

సరయూనది దక్షిణం వైపునుండి ఈ ఆశ్రమాల పుట్టుక పరంపర మొదలయ్యాయి. ఒకదానితో ఒకటి అనుసంధానమై ఉంటాయి. ఇటువైపు వచ్చిన ప్రతి గణం పశుసంపదతో సమస్త ఆర్యావర్తంలో గణుతి కెక్కే రోజులు రానున్నాయి. మలద కరూశ భూములు అలాంటివి మరి.

అయిదేళ్ళ కిందటి సంఘటన స్మృతిలోకి వచ్చి భయంతో కంపించాడు లోచనుడు. అది వర్షాకాల ఆరంభం. అష్టకుడికి నీళ్ళంటే ఎక్కడలేని సరదా. రోజులో ఎక్కువ భాగం ఆశ్రమానికి సమీపంలోని వాగులో తన స్నేహితులతో పాటు గడిపేవాడు.

ఆ రోజు సాయంత్రం వాతావరణం సాధారణంగానే ఉంది. తాను స్నానాదికాలు సంధ్యావందనం ముగించుకొని పూజలో మునిగి పోయాడు. హఠాత్తుగ వర్షం ప్రారంభమయ్యింది. వరుణినికి ఆగ్రహ మొచ్చినా, అనుగ్రహమొచ్చినా తట్టుకోవడం కష్టం. అడవుల్లో కురిసే వర్షాలపట్ల అప్రమత్తంగా ఉండాలి. క్షణాల్లో చిన్న చిన్న వాగులు వంకలు పొంగి పొర్లుతాయి. మహావేగంగా ప్రవహిస్తాయి. ఎగువ ప్రాంతాల్లో వర్షం తగ్గితే అంతే అకస్మాత్తుగా ప్రవాహాలు మాయమవు తాయి.

లోచనుడి మనసు కీడును శంకించింది. మరొక నార వస్త్రాన్ని తలపై ధరించి గుడిసె బయటకు వచ్చి దూరంగా చూసాడు. కనుచూపు మేర ఏమి కనపడడం లేదు. దట్టంగా కమ్ముకున్న వర్షం, మబ్బులు

తప్ప. అతని ముఖాన్ని వానజల్లు ఎడాపెడా బాదింది. చేతికర్ర తీసుకొని వేగంగా ఆశ్రమం బయటకు సెలయేరు వైపు పరిగెత్తాడు.

దూరం నుండి అష్టకుని మిత్రులు అరుస్తూ పరిగెత్తుకు వస్తున్నారు. "అష్టకుడు కొట్టుకు పోతున్నాడు..." అంటూ బిగ్గరగా కేకలు వేస్తూ వస్తున్నారు.

"అష్టకా" అంటూ గట్టిగా అరుస్తూ లోచనుడు సెలయేరు వైపు పరిగెత్తాడు. పిచ్చిపట్టినట్లు అరిచాడు. సెలయేరు మహావేగంగా మహా శబ్దంతో ప్రవహిస్తున్నది. ఒడ్డు వెంట వెర్రిగా పరిగెత్తాడు. చాలా చోట్ల జారిపడ్డాడు. ఒళ్ళు చీరుక పోయింది. అంతలో ఆశ్రమవాసులు వారితో కలిసారు. ఒడ్డు వెంట చాలా దూరం వెతికారు. సెలయేరు నదిని కలిసే చోట ఆగిపోయారు. అష్టకుడి జాడ ఎక్కడా కనబడలేదు. చీకటి పడింది. వెతుకులాట ముగిసింది. ఆశ్రమంలో విషాదం కమ్ముకుంది.

లోచనుడు కోలుకోలేకపోయాడు. అష్టకుడి పేరునే జపిస్తూ తనలో తానే మాట్లాడుకునేవాడు. తిండి తిప్పలు పట్టించుకోలేదు, పశు పోషణ కూడా అస్తవ్యస్తమయింది.

ఒక నెల తరువాత ఒకానొకరోజు అకస్మాత్తుగా అష్టకుడు ఊడిపడ్డాడు. అతడి శరీరం మీద గాయాల గుర్తులున్నాయి. అదొక పునర్జన్మలా అన్పించింది లోచనునికి. అతడి ఆనందానికి అంతులేదు. పితామహుడి అనుగ్రహమంటూ కృతజ్ఞతలు తెలుపుకున్నాడు.

నెల రోజుల పుత్ర వియోగం తరువాత, మొదటి సారి కలుసుకున్న అష్టకున్ని అక్కున చేర్చుకున్నాడు. అతని తలని ఆఘ్రాణించాడు. అలాగే కన్నీళ్ళు కారుస్తూ ఉండిపోయాడు.

స్నేహితులు, ఆశ్రమవాసులు అష్టకున్ని ప్రశ్నలతో ముంచెత్తారు, 'ఈ నెల రోజులు ఎక్కడ ఉన్నాడు, ఎలా ఉన్నాడు' అనేదే ప్రధాన సందేహం.

అష్టకుడు అన్ని విషయాలు వివరంగా చెప్పాడు. నదిలో కొట్టుకు పోతూ, గాయాలతో దాదాపుగా స్పృహ కోల్పోయే దశలో ఎవరో అతన్ని కాపాడి ఒడ్డుకు చేర్చారు. తగిన సపర్యలు చేసి తమ ఆవాసానికి తీసుకు వెళ్ళారు. నెలరోజులు అక్కడే ఉన్నాడు. గాయాలు మాని తిరిగి జవసత్వా లు పొందడానికి వారు అతనికి అనేక సపర్యలు చేశారు. కుదుటపడ్డాక తాను చెప్పిన వివరాలు పోల్చుతూ ఇక్కడ దిగబెట్టి వెళ్ళారు.

అష్టకుడు చెప్పిన వివరాలు విన్నాక.

"ఇంతకీ అది ఏ ప్రాంతం? నీకు సపర్యలు చేసిన వాళ్ళెవరు?" అడిగాడు లోచనుడు.

"అది సిద్ధాశ్రమానికి సమీపంలో ఉంది. తాటక సుందుల ఆధీనంలో ఉన్నాను ఇన్ని రోజులు. మారీచుడితో మంచి స్నేహం కుదిరించి నాకు. అక్కడి వాళ్ళు ఎంతో బాగా చూసుకున్నారు నన్ను..." అంటూ వెలిగిపోతున్న ముఖంతో చెప్పాడు అష్టకుడు.

అందరు విభ్రాంతి పొందారు. తేరుకోవడానికి చాలా సమయం పట్టింది వారికి. తాటక తెగ సంచరించే వన ప్రాంతంలోనివే మలద కరూశాలు. తరచు ఏదో ఒక విషయంపై ఆశ్రమవాసులతో ఆ తెగ వారికి ఘర్షణ జరుగుతూనే ఉంటుంది. తమ తెగ జోలికి వచ్చే వారి పట్ల తాటక చాలా నిర్దయగా ఉంటుందని ప్రతీతి.

క్రమ క్రమంగా అష్టకుడి ప్రవర్తనలో మార్పురాసాగింది. ఒక నెల ఆటవికులతో గడిపేసరికి వాడు ఆర్యేతరుడిగా మారిపోయాడా?

అష్టకుడి స్నేహితులు రాక్షసగణానికి సంబంధించి ఎన్నో ప్రశ్నలడిగే వారు. అక్కడి ముచ్చట్లు చెప్పడమంటే అష్టకుడి కెంత ఇష్టమో! తాను ఉంటే మాత్రం కసురుకునే వాడు. తీరిక సమయాల్లో అష్టకుడి చుట్టూ గుంపుగా చేరి గుసగుసలాడుకునే వారు.

ఒకసారి అందరూ విశ్రాంతిగా కూర్చున్నపుడు మాటల సందర్భం లో అష్టకుడు "అక్కడ జనం ఇంద్రుని పూజించరు తెలుసా!" అన్నాడు.

"అందుకే ఇంద్రుడు తప్పనిసరిగా వాళ్ళని శిక్షిస్తాడు" అన్నాడు కౌపాయనుడు. మహర్షుల వారు మాట్లాడే పడికట్టు పదాల్ని వల్లెవేస్తు. ఆ సంభాషణ అలా కొనసాగడం లోచనుడి కిష్టం లేదు. ఆ క్షణంలో తెలియలేదు కాని క్రమేణా అష్టకుడికి ఆ అటవీగణం పట్ల అనురక్తి కలిగి ఉండడాన్ని గమనించి కలవరపడ్డాడు లోచనుడు.

ఒకసారి అష్టకుడు వాడి మిత్రుల ముచ్చట్లు కొనసాగుతున్నపుడు లోచనుడు వారిని కసురుకున్నాడు. అయితే సౌవీర నుండి వచ్చిన ఒక రుషిపుంగవుడు మాత్రం అష్టకుడు ఇచ్చే సమాధానాల పట్ల చాలా ఆసక్తిని కనబరిచాడు.

"అష్టకా... వారు ఎవరిని పూజిస్తారు?" అని అడిగాడు.

"ఒక స్త్రీ విగ్రహాన్ని గురువర్యా" అంటూ బదులిచ్చాడు అష్టకుడు.

"అది ఎలా ఉంటుంది? ఏ జాతి స్త్రీల లాగా ఉంటుంది?"

అష్టకుడు తండ్రివైపు చూసి తలదించుకుని మౌనంగా ఉన్నాడు. తిరిగి అదే ప్రశ్నను రెట్టించి అడిగాడు సౌవీర రుషి.

"భారీగా కొంచెం భయంకరంగా ఉంటుంది. ఆర్య స్త్రీల లక్షణాలు మాత్రం ఉండవు" అన్నాడు అష్టకుడు. అతడి మిత్రులు కిసుక్కున నవ్వారు.

"స్త్రీని పూజించడము వింతే కదా" అంటూ గొణిగాడు సౌవీర రుషి.

"మన ఆడవాళ్ళు ఇంటి పనుల్లో మాత్రమే ఉంటారు. అక్కడ ఆడవాళ్ళు అన్ని పనుల్లో ముందుంటారు. వాళ్ళ మాటే చెల్లుబాటు అవుతుంది" అన్నాడు అష్టకుడు.

బహుశా తల్లి లేని లోటు వాడిని స్త్రీ పూజారాధకుల వైపు మనసు మళ్ళేటట్లు చేసిందేమో అనుకున్నాడు లోచనుడు.

కాని అష్టకుడి మాట అక్కడ ఉన్నవారిని గాయపరిచింది. "శ్రేష్టమైన ఆర్యగణాలతో వారికి పోలికేమిటి" అంటూ విసుక్కున్నారు.

"సహస్రనాగబల తాటకిని చూసావా నువ్వు? ఎలా ఉంటుంది?" అడిగాడు సౌవీర రుషి.

అష్టకుడి ముఖం నవ్వుతో వెలిగిపోయింది. అప్పుడు ఏమని సమాధానమిచ్చాడో గుర్తు లేదు కాని ఈ మధ్య కొన్ని రోజుల క్రితం అష్టకుడు తనతో ఇదే విషయాన్ని గుర్తుచేస్తూ ఇలా అన్నాడు.

"సహస్ర నాగబల తాటక! ఉండనీ. ఆ భయం ఆర్యగణాలకు ఉండాల్సిందే. లేకుంటే సమస్త ఆర్యేతర గణాల్ని హతమారుస్తారు".

కొంత విరామమిచ్చి తిరిగి మాట్లాడాడు.

"తాటక సాధారణ స్త్రీ. ఆ గణం లోని ఇతర స్త్రీలలాగే బలంగా ఉంటుంది. వాళ్ళు మన స్త్రీల లాగా కోమలంగా, సున్నితంగా ఉండ రు. ఆహారం సంపాదించడంలోనూ, ఆయుధాలు ప్రయోగించడం లోనూ వాళ్ళదే పై చేయి. మంచి గాత్రం ఉంది తాటకకు. ఆ గణం మంచి చెడ్డలు ఆమెకి తెలిసినంతగా ఎవరికీ తెలియవు.

వాళ్ళెంత మంచివారో తెలుసా. మనం ఇక్కడ ఉండడం వాళ్ళకు

అయిష్టమేమి కాదు. ఆర్యావర్తంలో బహిష్కృతులైన వారు అక్కడ నాకు కనిపించారు కూడా. ఎవరినైనా ఆదరిస్తారు. కాని మనం, మన పశువుల సంచారం కోసం, వ్యవసాయం కోసం వాళ్ళను ఇంకా అడవి లోపలివైపు తరుముతున్నాం. వాళ్ళు ఎవరినైనా కలుపుకోగలరు. మనం మాత్రం వాళ్ళను దాసులుగానో, రెండు కాళ్ళ జంతువులుగానో చూస్తాము" అన్నాడు.

వాడి మాటలకు తన గుండెలదిరాయి ఆ రోజు. ఆశ్రమంలోకి వస్తూ పోతూ ఉండే వారిలో చార్వాకుడెవరో లేదా రాక్షసమాయలో చిక్కుకున్న వారెవరో ఇట్లాంటి విషయాలు చెప్పి ఉంటారు అనుకున్నాడు లోచనుడు.

మరొకసారి అష్టకుడు దీక్షగా ఏదో చెక్కుతూ కన్పించాడు. వాడి చుట్టూ కొంతమంది పిల్లలు మూగి ఉన్నారు. చూసేసరికి అది అనాచ్ఛాదిత స్తనాలతో ఉన్న స్త్రీ బొమ్మ, ఆ దృశ్యం ఎవరి కంటనైతే పడకూడదో వారికే కనపడింది. మహర్షుల వారు చూడనే చూసారు. ఆగ్రహంతో ఊగిపోయాడాయన.

"లోచనా నీ కుమారుడు దైవదూషకుల చెంత ఉండి అక్కడి అధర్మాల్ని ఇక్కడ ప్రచారం చేయాలనుకుంటున్నాడా ఏమిటి? బ్రహ్మ రాక్షసుడిగా మారి నీవూ నీ పూర్వీకులు రౌరవాది నరకాలు చూడాలనుకుంటున్నారా" అంటూ తీవ్రస్వరంతో అరిచాడు.

అష్టకుడి చేతిలోని చెక్కబొమ్మను లాక్కొని అగ్ని గుండంలోకి విసిరేసాడు. అప్పటినుండి తానే అష్టకుడి నోరు నొక్కడం ప్రారంభించాడు. రాక్షస గాలి సోకిందంటూ మహర్షివారు ఏదో తంతు నడిపారు.

***

## – 3 –

యాగ నిర్వాహణ పనులు ఊపందుకున్నాయి. పనులన్నీ ఒక కొలిక్కి వస్తుండడంతో అగస్త్యుని ముఖం ప్రశాంతంగ ఉంది. తీర్చిదిద్దిన గడ్డం అతని ముఖానికి శోభనిస్తున్నది. శుభ్రంగా ఉన్న వస్త్రం భుజం మీద వేలాడుతూ ఉంది.

కాగడాల వెలుతురులో ఆశ్రమ పరిసరాలు వింత కాంతితో నీడల సమ్మిశ్రమంతో మనోహరంగా ఉన్నాయి. చల్లగాలి అందరినీ సేద తీరుస్తున్నది. కడుపునిండా మేత తిని నీరుతాగి సౌకర్యంగా ఉన్న పశువులు విశ్రాంతిగా ఉన్నాయి. శుభ్రపరచిన నేలమీద అగస్త్యుడు, యాగ నిపుణులు, ఆశ్రమవాసులు కూర్చుని ఉన్నారు. ఆగస్త్యుని రాకపట్ల మహర్షుల వారు మిగుల సంతోషంతో ఉన్నారు. మహర్షుల వారి పక్కన కూర్చున్న ధర్ముడు ఆగస్త్యుని వంకతిగిరి చేతులు జోడించి ఇలా అన్నాడు.

“స్వామి ఇక్కడ ఇంత పెద్ద ఎత్తున యాగం తలపెట్టడం సాహసోపేతమైన చర్య.అది మీ లాంటి మహానుభావులకే సాధ్యం. మీ ఆధ్వర్యంలో జరిగే ఈ యాగం వల్ల ఇంద్రుడు మనకు మరింత పశుసంపదను,

దాసుల్ని అనుగ్రహిస్తాడు. ఇంద్రుడి నీడన ఈ ప్రాంతం గోబ్రాహ్మణ పరమవుతుంది. యజ్ఞఫలాల్ని అందుకోవడానికి వచ్చిన దేవగణ సభ్యులను చూసి మేము ధన్యులమయ్యాము. అయితే స్వామి మన ధర్మం మన సాంప్రదాయాలు ఇక్కడి యక్షిణి తాటకికి కంటగింపుగా ఉన్నాయి. ఆ యక్షిణి నిరంతరం మనల్ని బాధిస్తూనే ఉంది. అయినా సరే, యక్షిణి, ఆమె వెంట ఉన్న అనుచరగణానికి భయపడి ఇంత పుష్టిగల భూముల్ని వదులు కోవడానికి మాకు మనస్కరించడం లేదు. సాక్షాత్తు పితామహుడి లాంటి మీరు దుష్టశక్తుల్ని పారద్రోలడానికి ఇక్కడ యాగ నిర్వాహణకు సంకల్పించడం మా అదృష్టం" అంటూ వినయంగా నమస్కరించాడు.

అగస్త్యులవారు గడ్డాన్ని నిమురుకుంటూ ధర్ముడివైపు ఇతర ఆశ్రమవాసులవైపు అక్కడక్కడ కూర్చుని ఉన్న తన అనుచరగణం వైపు చూస్తూ ఉన్నాడు. అతడి మదిలో ఏ ఆలోచనలు రేగుతున్నాయో చెప్పడం కష్టం.

కొంత దూరంలో కూర్చుని ఉన్న తిష్యకుడు లేచి నిలబడి చేతులు జోడించి "ఎన్నో జన్మల పుణ్యఫలం వల్లనే ఈ రోజు మీ దర్శన భాగ్యంతో పాటు ఈ పుణ్య కార్యంలో పాలుపంచుకోగలుగుతున్నాము. ఈ ప్రాంతంలో మా మహర్షుల వారి ఆశీర్వాదంతో మేం ఈ చిన్నపాటి ఆశ్రమాల్ని స్థాపించడానికైనా ఎంతో కష్టపడాల్సి వచ్చింది. ఇవన్నీ యక్షిణి తాటక సంచార భూములు. వాళ్ళు యాగ విరోధులు. వాళ్ళ భయంతో ఏనాడు యాగ క్రతువు నిర్వహింప సాహసించలేకపోయాం. కాని మీ తపశ్శక్తి, సాహసం పై మాకుగల విశ్వాసం మాలోని పిరికి తనాన్ని పారద్రోలింది.

పూజ్య అగస్త్యుల వారి ముందు ఒక మాట చెప్పసాహసిస్తున్నాను. గతంలో ఎంతో మంది రాక్షసుల్ని మీరు ఏరివేసి ఉన్నారు. మన బ్రాహ్మణోత్తములు అష్ట కష్టాలకోర్చి, అడువుల్లో నానా యాతనలు పడి ఆశ్రమాలు నెలకొల్పుతున్నారు. పశుసంపద పెంపుచేసి వ్యవసాయం చేసి పణులకు ఆశ్రయాన్ని కల్పిస్తున్నాం. వారి వ్యాపార మార్గాన్ని సుగమం చేస్తూ కష్టపడి ప్రాణాలకు తెగించి సంపద ప్రోగు చేస్తుంటే ఆర్య గణాలు మనకు అండగా నిలుస్తున్నాయా? ఆర్యా ధర్మాన్ని విస్తరిస్తూ ముక్కుమూసుకొని తపస్సు చేసుకునే మనల్ని కష్టకాలంలో ఆదుకోవడానికి రక్షణగా క్షత్రియులెవరైనా వస్తున్నారా? పైగా ఆశ్రమ సంపదను చూసి, కన్నుకుట్టి దాన్ని కాజేయడానికి పథకాలు పన్నడం తప్ప క్షత్రియులు చేస్తున్నదేమిటి. ఇదేమి అన్యాయం గురువర్యా?" కొంచెం బాధ, కోపం నిండిన స్వరంతో అన్నాడు.

తిష్యకుడి వైపు సాలోచనగా చూసాడు అగస్త్యుడు, అతని కళ్ళలో ప్రశంస కనబడింది. కాని దానిని మాటల్లో వ్యక్తపరచ దలచుకోలేదు. గంభీరమైన గొంతుతో అగస్త్యుడు

"బ్రాహ్మణ, క్షత్రియ వైరుధ్యాలు అంత మంచివి కావు. ఈ విశ్వానికి జ్ఞానబిక్ష పెట్టేది బ్రాహ్మణులే కావచ్చు గాక.. ధర్మాన్ని విస్తరించడం లోను, దానిని నిరాటంకంగా అన్ని కాలాల్లోను ఉనికిలో ఉండేటట్లు చేయడంలో బ్రాహ్మణులదే ఆధిపత్యం కావచ్చు గాక... ధైర్యంలోను సంపదలోను బ్రాహ్మణులది అగ్రస్థానం కావచ్చు గాక... దానికంత గొప్పలు పోవాల్సిన పనిలేదు. అధికారం ఇచ్చే సుఖంతోనూ, అనేక మంది భార్యలు, దాసదాసీ జనాల విలాసాలతో క్షత్రియులు కర్తవ్య విముఖులు కావచ్చుగాక... మనం మాత్రం మన

కర్తవ్యాన్ని విస్మరించగూడదు. ఆర్యగణాల విస్తరణ ఊపందుకోనుంది. దాసుల సంఖ్య పెరగనుంది. గంగకు దక్షిణ దిశన విస్తరణ జరిగి తీరాలి. లేకపోతే ఆర్యగణాలు తమలో తాము కలహించుకొని నాశనమ వుతాయి. గో బ్రాహ్మణులు గంగా దక్షిణదిశన యథేచ్ఛగా సంచరిం చాలి. నిజానికి నా జీవితధ్యేయం అదే. యోగ్యమైన ప్రతి చోట ఆశ్రమాలు నెలకొల్పాలి. ఇంద్రుడు మన వెంట ఉన్నాడు. పితామహు ల ఆశీస్సులు మనల్ని విజేతులగా నిలుపుతాయి" అన్నాడు.

అగస్త్యుడు మాట్లాడుతున్నంత సేపు అక్కడ ఉన్న ప్రతి ఒక్కరూ ఆరాధన భావంతో వింటూ ఉద్వేగం పొందడం అష్టకుడిని ఆశ్చర్య పరచింది. పక్కనే కూర్చున్న లోచనుడు కొడుకును గమనిస్తూ అగస్త్యుడి మాటలు వింటున్నాడు. అప్పటికే కొడుకును హెచ్చరించి ఉన్నాడు.

ఇంతలో అందరిలోకెల్లా వృద్ధుడైన బాహ్లికుడు అస్పష్టమైన గొంతుతో "మనం ఆర్యేతర భూముల్లో ఉంటున్నాము. ఇవి వారి సంచార భూముల నేవి వాస్తవం. ఎంతకాదన్న స్థానబలిమి వారికి అదనపు బలంగా ఉంటుంది. గిల్లికజ్జాలు పెట్టుకోవడం ఎందుకు? వారితో వియ్యమూ అవసరం లేదు, కయ్యమూ అవసరం లేదు. మన మానాన మనం ఉండడం మంచిదేమో...." మధ్య మధ్యలో మాటలు మింగుతూ తన అభిప్రాయాన్ని చెప్పాడు.

అగస్త్యుడు చిటపటలాడే ముఖంతో "ఎవరి భూములు ఇవి? సమస్త భూమండలం పితామహుల సృష్టి. పితామహుడిని పూజించే వారిదే ఈ భూమి. ఇంద్రుడిని ఆరాధించే వారిదే ఈ భూమి. హీనమైన ఆటవిక జాతుల వారిది కాదు" అన్నాడు కటువుగా.

బాహ్లికుడు లేచి నిలబడ్డాడు. వణుకుతున్న గొంతుతో "పూజ్యుడా!

మనమీద ఈ అనాగరిక జనం ఓ కన్నేసి ఉంచారు. దర్భలను సేకరించడానికి నిన్న అడవిలోకి వెళ్ళిన మన వారితో హెచ్చరిక పంపారు. ఈ సారి మన వాళ్ళను అడ్డుకున్నది స్వయంగా సుందుడు, తాటక. ఒకసారి అక్కడ దెబ్బతిన్న మనవాళ్ళతో మీరు స్వయంగా మాట్లాడితే బాగుంటుంది" అన్నాడు.

అగస్త్యుడు ఏమి మాట్లాడలేదు. అతని మనసు పరిపరి విధాలుగా ఆలోచిస్తున్నది. ఈ మార్గంలో ప్రమాదం పొంచి ఉన్న విషయం తనకు తెలుసు. కాని తన లక్ష్యం అజేయమైనది. ఆర్యగణ నాయకులు విలాసాలకు మరుగుతున్నారు. తాటకవనం అంటే భయం. సిద్ధాశ్రమం పేరు వింటే చెమటలు పడతాయి. కామ రూపం గురించి ఆలోచనే లేదు. ఇక వింధ్య దాటడమంటేనా... ఇంద్రుడికి సైతం వణుకు. కనీసం ఆ ఊహను కూడ వారు పొరపాటున రానీయరు.

తాను అలాకాదు. ఈ అగస్త్యుడి వల్ల కాకపోతే మరొక అగస్త్యుడి వల్ల సాధ్యమవుతుంది. అగస్త్యుడే స్వయంగా కార్చిచ్చు. గంగ దక్షిణం వైపే కాదు. సౌవీర నుండి కామరూపానికి... అంతే కాదు వింధ్య దాటి దక్షిణాంతం వరకు యథేచ్ఛగ ఆర్యగణ గోబ్రాహ్మణులు సంచరించేలా చేస్తాడు. గోబ్రాహ్మణులకు మార్గం సుగమం చేయడమే ఈ ఆగస్త్యుని లక్ష్యం. మనసులో అనుకున్నాడు ఆగస్త్యుడు.

వృద్ధుడిని కూచోమన్నట్టు సైగ చేసి "మీరంతా ఒక విషయం అర్థం చేసుకోవాలి. చిన్న కంచె, దానిలోపల అయిదారు కుటీరాలు, ఇవి కాదు కావాల్సింది. యజ్ఞం చేయడం... ఇది మాత్రమే దేవతల ఆశీర్వాదాన్ని, వారి బలాన్ని మనకు ఇస్తుంది. అంతే కాకుండా మన ధర్మాన్ని ప్రతిష్టింప చేస్తుంది. ఈ మార్గంలో అనేక ఆటంకాలు వచ్చే

అవకాశమున్న మాట నిజమే. వాటికి భయపడి మన కర్తవ్యం నుండి విముఖులమైతే మన పితృదేవతలు కూడా మనల్ని క్షమించరు" అన్నాడు అగస్త్యుడు.

ఇద్దరు యువకులు చాలాసేపు లేచి నిలబడి ఉండడాన్ని గమనించి చెప్పమన్నట్టుగా వారివైపు చూసాడు అగస్త్యుడు.

"గురువర్యా దర్భలను సేకరించడానికి మేమిద్దరం కొంచెం లోతట్టుకు వెళ్ళాం. కొంత సేపటి తర్వాత హఠాత్తుగా మా ముందుకు ఒక అసురుడు వచ్చాడు. వాడిని పక్కకు వెళ్ళగొట్టాలనుకున్నాము. గొడ్డలిని వాడివైపు చూయించి విసురుతున్నట్లుగా బెదిరించాం. అలా చేసామో లేదో చెట్లచాటు నుండి చాలా మంది వచ్చి మా చుట్టూ చేరారు. కొంత మంది చేతుల్లో మొనదేలిన కర్రలు, రాతి మొనలున్న బళ్ళాలు ఉన్నాయి. మరి కొంత మంది చేతుల్లో రాతి గదలు, కర్రపిడి ఉన్న రాతి గొడ్డళ్ళు ఉన్నాయి. వాళ్ళలోంచి ఒక బలిష్టమైన స్త్రీ మా ఎదుట వచ్చి నిలబడింది. ఆమే తాటక అని తర్వాత తెలిసింది. ఆమె మాట్లాడుతున్న మాటలు కొంచెం కొంచెంగా మాకు అర్థమయ్యా యి. ఆమె అంది 'మీ దుందుడుకు చేష్టల్ని సహించడం కష్టంగా ఉంది. తాటి వనాల్ని కొల్లగొడుతున్నారు. మీ వేటవల్ల సంచారం వల్ల మాకు కందమూలాలు, వేటమాంసం దొరకడం కష్టమైపోతున్నది. మా వాళ్ళని అకారణంగా గాయపరుస్తున్నారు. మిమ్మల్ని తరమడం కష్టమైన పనికాదు. కాని అకారణ హింస మా రీతి కాదు. అది మీ ఆర్యజనాల లక్షణం. ఈ తాటక మాటగా మీ మహర్షికి చెప్పండి.యాగాల పేరుతో జరిగే తంతుని మేం అనుమతించబోము. మా పై అకారణమైన దాడుల్ని సహించబోం. మమ్మల్ని దాసులుగా చేసుకునే ప్రయత్నాన్ని విరమించు

కోమని చెప్పండి. మీ ధర్మాన్ని ఇక్కడ స్థాపించడానికి ప్రయత్నిస్తే కీడు జరుగుతుందని మా మాటగా చెప్పండి"... అంటూ హెచ్చరిక చేసింది తాటక. ఈ విషయాన్ని మీతో నేరుగా చెప్పే సాహసం లేక, మీరు మమ్మల్ని పిరికి వారని తిడతారని శపిస్తారనే భయంతో మా ఆచార్యుల వారికి చెప్పుకున్నాం" అన్నారు ఆ యువకులు.

అగస్త్యుడి వెంట వచ్చిన సుమారు పది మంది యువకులు లేచి నిలబడ్డారు. వాళ్ళు దృఢంగా మంచి జబ్బ పుష్టితో ఉన్నారు.

"మన సాంప్రదాయాల్ని దూషిస్తే ఎలా సహించారు మీరు? అదే మేమయితే వాళ్ళను నరకానికి పంపడమో, మేం స్వర్గానికి వెళ్ళడమో జరిగేది. అందుకే మా పూజ్య గురువులు అగస్త్యుల వారు ఎప్పుడూ ఒక మాట అంటుంటారు. ముని వాటికల్లో శిష్యులకు ఖడ్గ చాలన విద్య, ధనుర్విద్య నేర్పాలని! వేదాధ్యయనం మాత్రమే సరిపోదు" అంటూ ఏదేదో మాట్లాడసాగారు.

అగస్త్యుడు వారిని ఆగమన్నట్లుగా చేతితో సంజ్ఞచేసాడు.

"అక్కడ వాళ్ళు చాలామంది ఉన్నారు..." అని గొణుగుతున్నట్లు గా అంటూ కూర్చున్నారు ఆ ఇద్దరు యువకులు. అక్కడి రణగొణ ధ్వనిలో ఆ మాటలు ఎవరికీ వినిపించలేదు. బాహ్లికుడు మళ్ళీ కల్పించుకున్నాడు.

"మీ శిష్యులంటున్న మాట నిజమే మహాత్మా! నా మాట కూడా అదే. క్రూరులైన ఈ ధర్మహీనుల్ని ఎదుర్కోవాలంటే కేవలం వేద మంత్రోచ్ఛారణ సరిపోదు. బలప్రయోగం కావాలి. కొంత సంయమనం పాటిద్దాం. గంగ అవతలి నుండి క్షత్రియ సహాయాన్ని తెచ్చుకుందాం" అన్నాడు దృఢంగా.

అగస్త్యుడు ఆ వృద్ధుడి వైపు అసహనంగా చూశాడు. ఇలా అన్నాడు.

"వేద మంత్రోచ్చారణ పట్ల ఆచార్యుల వారికి సంపూర్ణ విశ్వాసం లేనట్లుంది. ఇంద్రుడి పదఘట్టనల కింద వీళ్ళు నశిస్తారు. యాగశాలల నుండి వచ్చే ధూమం చాలు - వాళ్ళను నిర్జీవులుగా చేయడానికి. పితామహుడి పట్ల విశ్వాసం ఉంచండి. ప్రస్తుతం మనకు ఉన్న బలం చాలు. మన పూర్వీకులు గతంలో ఎంతో మంది ధర్మవిరోదుల్ని నిర్మూలించారు. అన్నీ శుభశకునాలు గోచరిస్తున్నాయి. తాటకను చూసి తాటాకు చప్పుళ్ళకు పారిపోతే ఊర్ధ్వలోకాల్లో మన గతి ఏమవుతుంది? ఇక క్షత్రియ సహాయం గురించి ఎంత తక్కువ మాట్లాడితే అంత మంచిది. వారి సహాయం బ్రాహ్మణ తేజస్సును మసక బారుస్తుంది. బ్రాహ్మణ కీర్తి మాత్రమే నూతన ప్రాంతాల్లో నిలవాలి" అంటూ ఈ చర్చను ఇక ముగిద్దాం అన్నట్లుగా లేచినిలబడ్డాడు ఆగస్త్యుడు.

"మరో రెండు రోజుల్లో యాగం ఆరంభమవుతుంది. మిగతా పనులన్నీ పూర్తి కావాలి" అంటూ తనకు కేటాయించిన కుటీరం లోకి వెళ్ళిపోయాడు ఆగస్త్యుడు.

రెండు రోజుల అనంతరం యాగం మొదలయ్యింది. అందరూ శుచిగా, నిష్టగా యాగ నియమాల ప్రకారం నడుచుకుంటున్నారు. పశువులు వధించబడుతున్నాయి.వాటి నాభి కింద ఉన్న పొరను నేర్పుగా సేకరించి హెూమ గుండానికి చేరవేస్తున్నారు. వారి నైపుణ్యం అబ్బుర పరుస్తున్నది. రక్తం మడుగులు కట్టింది.

"ఎంత గొప్ప యజ్ఞం! అందుకే సంపద కల్గిన గోత్రం మాత్రమే ఇలాంటి యజ్ఞాన్ని నిర్వహించగలదను కుంటుంటారు" అన్నారు కొందరు కొత్తగా యాగాన్ని చూస్తున్నవారు.

"ఇదేం చూసారు? మన  ఆగస్త్య మహర్షుల వారు గతంలో ఒక యజ్ఞం చేసారు.  ఎన్నింటిని వధించామో!  రక్తంలో నడుస్తుంటే మోకాళ్ళ దిగేవంటే నమ్మాలి" అన్నారు ఇంకొందరు.

యాగనిపుణులు లయబద్ధమైన మంత్రోచ్చారణ చేస్తున్నారు.  రక రకాల పదార్థాలను హోమంలో వేస్తూ "స్వాహా" అంటున్నారు.  అగ్ని దేవుడి భార్య పేరు స్వాహా. యాగం పూర్తయింది.  యాగ ఫల స్వీకరణ కూడా అయిపోయింది.  దేవగణాల ప్రతినిధులు ఒక్కొక్కరు వచ్చి యాగఫలాన్ని స్వీకరించారు. అంతలో ఏదో గొడవ  మొదలయింది.

***

## - 4 -

ఏపుగా పెరిగిన చెట్ల సందుల నుండి సూర్య కిరణాలు ఏటవాలుగా దూసుకవస్తున్నాయి. తాటక తన ముందు కుప్పగా పోసిన రాళ్లను అటు ఇటు కెలుకుతున్నది. రాళ్ల నాణ్యత పసికట్టడంలో నేర్పరి ఆమె. పెళుసుగా ఉండి తొందరగా విరిగే రాళ్లను వేరు చేసింది. శ్రద్ధగా పగులగొట్టడం చేస్తే వాటిలోంచి కూడా చర్మాన్ని ఒలిచే పదును తేలిన వాటిని తయారు చేయవచ్చు. వాటికంటే కూడా కఠినమైన శిలలను అతి ప్రయత్నం మీద నేర్పుగా పగులగొట్టినపుడు వచ్చే ప్రతి ముక్క ఏదో ఒక విధంగా ఉపయోగపడుతుంది. తక్కువ పరిమాణంలో ఉన్నప్పటికి బరువుగా ఒకవైపు పదును తేలిన రాయిని ఎంచుకుంది తాటక. అప్పటికే సిద్ధం చేసుకున్న మోచేయి పొడవున్న కర్రను తీసుకుని రాయిని నారతోను జంతు చర్మంతోను కట్టడం మొదలు పెట్టింది. కొంత సమయం గడిచాక గొడ్డలి తయారయ్యింది.

అక్కడక్కడ కూర్చుండి కొంతమంది రాతి గదలను, బరిశెలను మొనదేలిన కర్ర బళ్ళాలను తయారు చేస్తున్నారు. రాతి గొడ్డలిని చేత బట్టుకొని లేచి నిలబడింది తాటక. గొడ్డలి పిడిని వివిధ స్థానాల్లో

పట్టుకుంటు పరిశీలించింది. గొడ్డలి చివర రాయి బరువు, పదును పరిశీలిస్తూ వివిధ స్థానాల్లో గొడ్డలిని పట్టుకుంటూ గాలిలో అటు ఇటు ప్రయోగిస్తూ దాని పనితీరును అంచనా వేయసాగింది. ఆమె గొడ్డలి విన్యాసాన్ని అందరూ ఇష్టంగా చూడసాగారు. గొడ్డలినైనా రాతిగదనైనా అతి వేగంగాను అత్యంత బలంగాను అన్ని దిశలలో ప్రయోగించడంలో తాటక దిట్ట. ఆమె భర్త సుందుడు కూడా అందుకేమి తీసిపోడు. ఆ మాటకొస్తే ఆ తెగలోని ఆడ, మగ అందరూ చురుకైన వారే. తాటక, సుందుల పుత్రుడు మారీచుడు మంచి సాహసవంతుడు. వేగంగా ప్రయాణించడంలో మేటి. నీటిలో దుమికితే బుడుబుంగ పిట్టే.

గొడ్డలి విన్యాసాన్ని ఆపింది. గొడ్డలిని వేగంగా విసిరింది. అది కన్ను మూసి తెరచే లోపల నల్లమద్ది చెట్టుకాండంలో బలంగా దిగింది. దానివైపు తృప్తిగా చూసి విశ్రాంతిగా కూర్చుంది తాటక.

తాటకను యక్షిణి అంటే నమ్మడం కష్టం. సాహసం, తెగువ, వివేకం సాధారణ యక్షుల కంటే భిన్నంగా ఆమెను తయారు చేసాయి. దానికి తోడు యోధులైన నాగులు ఆమె అనుచరగణంగా చేరడం వల్ల ఆ వనంలో వారికి ఎదురు లేకుండా పోయింది. అంతటి యోధురాలైన తాటక పరమ శాంతంగా ఉంటుంది. ఎంతో కఠినమైన సందర్భమయితే తప్ప ఆగ్రహం రాదు.

ఇంతలో ఇద్దరు వ్యక్తులు పరిగెత్తుకుంటూ వచ్చారు. వారి శరీరాల నుండి రక్తం ధారగా కారుతున్నది. అందరూ వారి చుట్టూ చేరారు. ఒకరు దొప్పలో నీళ్లు తీసుకవచ్చి గాయాల్ని కడిగారు. కొన్ని నీళ్లు తాగించారు. ఇంకెవరో కొన్ని ఆకుల్ని దంచి తీసుకవచ్చి ఆ గాయాల మీద పెట్టి నార వస్త్రంతో కట్టు కట్టారు. ఆ గాయాల్ని చూడగానే

తెలిసింది పదునైన ఆయుధాలతో చేసిన గాయాలని. వారిద్దరూ మూల్గుతూ కూర్చున్నారు.

"ఈ ఆర్యావర్తవాసుల ఆగడాలు ఈ మధ్య మరీ ఎక్కువవుతున్నాయి" – అన్నారొకరు. గాయపడినతను మూలుగుతూ

"ఈరోజు వాళ్లు మనవైపు మరికొంత చొచ్చుక వచ్చారు. వేట కోసం వెళ్లిన మేము వారి కంటపడగానే మమ్మల్ని తరమడం మొదలు పెట్టారు. పశువుల్ని కదా వేటాడినట్లు మా మీద పరుశువుల్ని ప్రయోగించారు. కొద్దిలో తేడా వస్తే మెడ తెగేదే. అదృష్టం కొద్ది భుజం మీద దిగింది" అన్నాడు బాధను ఓర్చుకునే ప్రయత్నం చేస్తూ.

అక్కడ ఉన్న వారందరూ ఆగ్రహంతో ఊగిపోయారు.

"ప్రతీకారం తీర్చుకోవలిసిందే" అన్నారంతా ముక్తకంఠంతో.

"ఇలాగే ఊరుకుంటే మన ఆవాసాల్ని ఆక్రమించుకొని మనల్ని చంపడమో తరమడమో ఖాయం" అంది విజ.

"అందుకే ఇక్కడ అడుగు పెట్టే ప్రతి ఒక్కడిని మొదట మనమే చితగ్గొడితే సరిపోయేది. ఇక్కడికి రావాలంటేనే భయపడి పోయే వాళ్లు. ఇపుడు చూడు... మొదట ఒకరిద్దరు వస్తారు. మనం పోనీలే అనుకుంటాం. పదిమంది వస్తారు. పిడికెడు మందికి ఈ అరణ్యాలు అరిగేవా, కరిగేవా అని వదిలేస్తాం. గుంపులు గుంపులుగా వస్తారు. వనాన్ని నరకడం... ఆవాసాలు... యాగాలు... పైగా మనమీదే దాడులు. వాళ్లకు గుణపాఠం నేర్పాల్సిందే" అన్నాడు ఉరన కోపంగా. అందరూ అతడితో ఏకీభవించారు.

యుద్ధ పిపాస వాళ్లను కమ్ముకుంది.

"ఇక ఉపేక్షిస్తే లాభం లేదు" అంది తాటక. అంతా నిశ్శబ్దంగా

ఉన్నారు.

"నేను వాళ్లతో మాట్లాడతాను" అంది తాటక.

మళ్లీ నిశ్శబ్దం భంగమైంది. తాటక మాటలు విని ఉలిక్కి పడ్డాడు చిత్రరథుడు. అతడు ఆర్యవర్తం నుండి బహిష్కరింప బడినవాడు. వీళ్ళతో చాలా సంవత్సరాలుగా కలిసి ఉంటున్నాడు.

"వాళ్ల సంగతి మీకు తెలియదు. వాళ్లను నమ్మొద్దు" అన్నాడతను.

"అయినా వెళ్లి ఏం మాట్లాడుతారు? మొన్ననే కదా చెప్పి చూసారు" అని కూడా అన్నాడు తాటక ప్రయత్నాన్ని నిరుత్సాహపరచడానికి.

"ఈసారి వాళ్ల ముఖ్యుడితో మాట్లాడదాం. రెండే రెండు విషయాలు. మొదటిది ఇప్పుడున్న ప్రాంతానికే పరిమితం కావాలి. రెండవది ఈ యాగాలు, మన మీద దాడులు ఆపమని. ఉంటే మనతో సామరస్యంగా ఉండాలి లేదా వెళ్లిపోవాలి. జగడమే కోరుకుంటే ఎవరూ వెనక్కి వెళ్లరని హెచ్చరిస్తాను" అంది తాటక స్థిరమైన గొంతుతో.

చిత్రరథుడు తల అడ్డంగా ఊపుతూ,

"ఈ పరిణామం మీకర్థం కావడం లేదు. కాని మాకు తెలుస్తోంది. ఇవి గిల్లికజ్జాలు కావు. చాలా స్పష్టమైన లక్ష్యంతో ముందుకు తోసుకు వస్తున్నారు. ఆర్యగణాలు తమ గణ ప్రజలతో మాత్రమే చాలా ఉత్తమం గా ఉంటారు. ఆ గణంలోని వాళ్లే అయినా సరే తమ పద్ధతుల్ని ఆచారాల్ని విమర్శించే వారి పరిస్థితి అధోగతే. సాక్షాత్తు ప్రమాణం నేను. ఇక ఆర్యేతర తెగల విషయమా, వారి పట్ల ఆర్యగణాలు పరమ క్రూరంగా ప్రవర్తిస్తాయి" అన్నాడు.

"అయితే నువు సూచించేదేమిటి"? అడిగాడు సుందుడు.

"మన జాగ్రత్తలో మనం ఉండాలంటాను" అన్నాడు చిత్రరథుడు.

"నువ్వు మాకు పిరికితనం నూరిపోస్తున్నావు" కోపంగా అన్నాడు ఉరనుడు. చాలామంది వెక్కిరింతగా నవ్వారు. చిత్రరథుడు ముఖం మాడ్చుకొని దూరంగా వెళ్లి కూర్చున్నాడు. వాళ్లందరిని ఆగమన్నట్లుగా సుందుడు సైగ చేసాడు.

"చిత్రరథుడు చెప్పింది కూడా ఆలోచించవలసిందే. అందరం సన్నద్ధంగా ఉందాం. ఆశ్రమం సమీపంలో మోహరిద్దాం. వాళ్లు పరిమిత సంఖ్యలో ఉన్నారు. నయానో, భయానో ఒప్పించవచ్చు. ఈ మాత్రం దానికి నువ్వెందుకు. నేను వెళ్లి మాట్లాడతాను" అన్నాడు సుందుడు.

అందుకు అందరు సమ్మతించారు. ఆశ్రమం దిశవైపు వేగంగా వెళ్లసాగారు.

చాలాదూరం నడిచారు. అక్కడి చెట్లు, పుట్టలు, గుట్టలు, పొదలు, నీటి గుంటలు అన్నీ కొట్టిన పిండి వారికి. పరిగెత్తినట్లు నడవడంలో వారు ప్రసిద్ధి. వనంలో వారి చలనం చూడముచ్చటగా ఉంటుంది. కనులు మూసి తెరచేంతలో చాలా దూరం వెళ్లగలరు. చూస్తుండగానే ఎంతో దూరం నుండి సమీపానికి రాగలరు. ఇక రాత్రివేళ వారి కదలికలు అమోఘం. ఇవన్నీ చిలువలు పలువలుగా చేరి వాళ్లకు అతీంద్రియ శక్తుల్ని ఆపాదింపచేసారు ఆర్యవర్త వాసులు.

ఎంతో సేపటికిగాని ఆశ్రమ పరిసరాలకు చేరుకోలేక పోయారు. చాలా దూరంగా ఆశ్రమం కనబడుతోంది. సాయంకాలపు ఆకాశం నెత్తురు పూసుకుంది. ఉన్నట్టుండి అకస్మాత్తుగా గాలి ఉధృతంగా వీయడం మొదలయింది. చెట్ల కొమ్మల విసుర్లకు వాళ్లు నడక వేగాన్ని తగ్గించారు. గాలి రొద వాళ్ల చెవుల్ని గింగుర్లెత్తించింది.

అందరూ ఒకచోట చేరారు. గాలి శాంతించింది. మెల్లగా ఆశ్రమం

దిక్కు నడవ సాగారు. పలుచబడిన అడవి ఆశ్రమం ఆనవాళ్లను చూపెట్టింది. భాసపక్షుల ధ్వనులు తీవ్రమైనాయి. పచ్చి నెత్తుటి వాసన హోమపు ధూమపు వాసన వాళ్ల ముక్కు పుటాల్ని చేరాయి. ఆశ్రమం లోంచి వస్తున్న ధూమాన్ని దూరం నుంచే చూసిన తాటక సుందుల పరివారము ఆశ్చర్యపోయింది.

మళ్లీ యాగం మొదలు పెట్టారన్నమాట. ఇది మొదటే పసిగడితే వారిని అడ్డుకునే వారే. కోసి వృథాగా పడవేసిన మాంస ఖండాలను స్రుక్‌భాండాలను యజ్ఞవాటికల్లోకి విసిరేసి అగ్నిని అర్పేవారే. బతుకు తెరువుకు వచ్చేవారేదో పొట్టకూటి పనులు పెట్టుకోకుండా, దేన్ని కాదంటామో అదే చేస్తు రెచ్చగొట్టడమెందుకో తెలియదు. వాళ్ల పురాల్లో మన మాతృదేవతల్ని ప్రతిష్టిస్తే ఊరుకుంటారా వీళ్లు? వాళ్లకు అసహనం కలగసాగింది. సుందుడు వాళ్లందరిని అక్కడే ఆగమన్నాడు. తాటక, మారీచుడు మరి ఇద్దరు అనుచరులతో కలిసి సుందుడు ఆశ్రమం వైపు నడవసాగాడు. ఆశ్రమం సమీపంలోకి వచ్చారు వారు. రణగొణ ధ్వనులు వినబడుతున్నాయి. తాటకను, మారీచుడిని అక్కడే ఉండ మన్నాడు. ఇద్దరు అనుచరులను తీసుకొని ఆశ్రమం వైపు వెళ్ళాడు సుందుడు.

ఆశ్రమంలోకి చేరుకోగానే అక్కడి వాతావరణం చూసి ఆశ్చర్య పోయాడు. బహుశా అపుడే యాగం పూర్తయినట్లుంది. దూరంగా జంతు కళేబరాలు పడి ఉన్నాయి. నేలంతా రక్తంతో తడిసి ఉంది. రక్తంతో నింపిన భాండాలు అనేకం ఉన్నాయి. ఆ ప్రాంతమంతా కోలహాలంగా ఉంది. సుందుడిని అతని అనుచరుల్ని చూసి ఒక క్షణం నిశ్శబ్దం అలుముకుంది. యజ్ఞవాటిక వద్ద ప్రత్యేకంగా కనిపిస్తున్న అగస్త్యుడి

వైపు నడిచాడు సుందుడు. అక్కడున్న కొద్దిమంది సుందుడిని అడ్డుకున్నారు.

“దూరంగా ఉండు అసురుడా” అంటూ ఛీత్కరించారు. “ఈ ప్రదేశాన్ని అపవిత్రం చేయొద్దు” అన్నారు.

సుందుడికి అంతులేని ఆగ్రహం కలిగింది. చేతికందిన వస్తువుల్ని హోమగుండం లోకి విసిరేస్తు అగస్త్యుడి వైపు వచ్చాడు సుందుడు.

***

## – 5 –

సుందుడు అగస్త్యుడితో గొడవ పడడం చూసాడు అష్టకుడు. అతడితో పాటు ఇద్దరు అనుచరులు మాత్రమే ఉండడం గమనించాడు. అతడు కఠినమైన ముఖంతో తీవ్రస్వరంతో మాట్లాడుతున్నాడు.

"...మీ దుష్ట ఆచారాల్ని మా వనాలు ఆమోదించవని ఎప్పుడో చెప్పాము. ఏమిటీ హింస? మేం  ఆహారం కోసం, ఆత్మరక్షణ కోసం తప్ప జంతువుల్ని చంపము. ఇక మా వనవాసులపై మీ దాష్టికం ఎంత చెప్పినా తక్కువే. ఇప్పటికైనా హెచ్చరిస్తున్నాము. ఈ వనాన్ని విడిచి వెళ్లండి" అన్నాడు కోపంగా సుందుడు.

అగస్త్యుడు ప్రశాంతంగా సుందుడి మాటలు విన్నాడు. తన శిష్యుల వైపు సూటిగా చూశాడు. అగస్త్యుడి సంజ్ఞ అందుకున్న అతని శిష్యులు హఠాత్తుగా కన్ను మూసి తెరచే లోపల సుందుడి మీద అతని అనుచరుల మీద దాడి చేశారు. ఊపిరి పీల్చుకోవడానికి కూడా సమయమివ్వలేదు. హెచ్చరిక లేకుండా జరిగిన దాడిలో సుందుడి అనుచరులు నుజ్జు నుజ్జయ్యారు. సుందుడు చాలా ప్రతిఘటించాడు. కాని లాభం లేకుండా పోయింది. ఒకరిద్దరిని తీవ్రంగా గాయపరచగలి గాడు గానీ ఆత్మరక్షణ

చేసుకోలేకపోయాడు.

కొన ప్రాణంతో నేల మీద పడి ఉన్న సుందుడి సమీపాన విజయ గర్వంతో నిలబడ్డాడు అగస్త్యుడు.

అష్టకుడు ఏదో చెప్పబోతూ ముందుకు రాబోయాడు. అతనికి దు:ఖం ఆగలేదు. ప్రమాదాన్ని పసిగట్టిన లోచనుడు అష్టకున్ని వారించాడు. దూరంగా తీసుకవెళ్లాడు.

“అష్టకా ఆన. ఈ స్థానం నుండి నేను చెప్పేంత వరకు ఒక్క అంగుళం కదిలినా ఒక్క మాట బయటకు వచ్చినా ఆన. పుణ్యలోకాల ఉన్న మీ తల్లిమీద ఆన” అన్నాడు లోచనుడు.

తల్లి ప్రస్తావన రాగానే దు:ఖం తన్నుకొచ్చింది అష్టకునికి. శబ్దం రాకుండా వెక్కిళ్లు పడుతూ దు:ఖంతో కూలబడ్డాడు అష్టకుడు. లోచనుడు ఎప్పుడు తెచ్చాడో, ఎలా తెచ్చాడో తెలియదు కాని నల్లమందు కలిపిన పాలను బలవంతంగా అష్టకుడికి తాగించాడు. మత్తును కల్గించే నశ్యాన్ని పీల్చేటట్లు చేసాడు. అతడి శరీరం నిస్తేజమైపోయింది.

అష్టకుడు అలాగే కూర్చుండి పోయాడు. కన్నీళ్లు ధారాపాతంగా కురుస్తున్నాయి. దూరంగా జరిగేదంతా కొంత అస్పష్టంగా కన్పిస్తుంది. కాళ్లు, చేతులు స్వాధీనం తప్పాయి. లోచనుడు అష్టకుడి పక్కనే కూచొని అతడి తలను భుజం మీద పెట్టుకొని నిమురుతు ఉండిపోయాడు.

దగ్గరలోని కర్రను చేతిలోకి తీసుకున్నాడు అగస్త్యుడు. శిష్యులు అతడిని అనుసరించారు. సుందుడి తలపైన బలంగా ఒక్క దెబ్బ పడింది. పెనుకేక వేసాడు సుందుడు. అతడి శరీరం ఊగిపోయింది. కొంత తడవు తర్వాత నిర్జీవమై పోయింది.

అగస్త్యుడి శిష్యులు జయజయపధ్వానాలు చేశారు.

"అగస్త్యుడి మహిమలు అమోఘం"

"గో[బ్రాహ్మణులకు ఎదురులేదు"

"ఈ మా[తం దానికి క్ష[తియులు రావాలా" అంటూ అరిచారు.

విజ్ఞులైన కొంతమంది ఆ[శమవాసులు ఈ చర్యతో కలవర పడ్డారు. కాని అక్కడున్న మిగతా వారిలో ఒక యుద్ధోన్మాదం ఆవహించింది. వె[రిగా జయజయధ్వానాలు చేయడం మొదలుపెట్టారు. అరుపులు, నవ్వులు పదింతలుగా ఆకాశాన్ని చీలుస్తున్నాయి.

ఆ[శమానికి దూరంగా నిలబడ్డ తాటక, మారీచులకు జనం కోలహాలం వినిపించింది. కొంత విరామం తర్వాత సుందుడి కేక వాళ్లలో ఆందోళనను నింపింది. తాటక మనసు కీడును శంకించింది. పరుగు పరుగున ఆ[శమంలోకి చొరబడింది. అక్కడి దృశ్యం చూడగానే [మాన్పడి పోయింది. తన మనుషులిద్దరు నుజ్జునుజ్జయి మాంసపు ముద్దల్లా పడి ఉన్నారు. మడుగులు కట్టిన రక్తంలో సుందుడు నిర్జీవంగా పడి ఉన్నాడు. కట్టలు తెంచుకున్న దు:ఖంతో సుందుడి శవం మీద పడి పెద్ద పెట్టున రోదించసాగింది. వచ్చింది తాటక అని తెలియగానే ఆ[శమవాసులు కలవరపడ్డారు.

ఆమె వీరత్వం, తెగువ మలద కరూశవాసులందరికి తెలుసు. ఒంటి చేత్తో ఎంతటి మదగజాన్నయినా లొంగదీస్తుందని, ఒంటరిగా వ్యా[ఘ సమూహంలోకి చొరబడి వాటిని చెల్లాచెదురు చేయగల దని... రకరకాల సంఘటనలు చిలువలు పలువలుగా మారి ఆమెకు అపార శక్తుల్ని ఆపాదించాయి.

తాటక ఆర్యవర్తంలోని [శేష్టులైన యోధుల్లాగా ఒడ్డు, పొడవు ఉన్న మాట వాస్తవమే కాని మరీ ఏనుగంత ఎత్తు లేకపోవడం వారిని

ఆశ్చర్యపరిచింది. ఆమె సాధారణ స్త్రీ వలె జుట్టు విరబోసుకొని భర్త శవంపై పడి దీనమైన గొంతుతో ఏడవడం వారికి ధైర్యాన్ని కలిగించింది.

నిశ్చేష్టుడై తండ్రి శవం పక్కన కూలబడి ధారాపాతంగ కన్నీరు కారుస్తున్న మారీచుడిపై ఓ కంట కన్నేసి ఉంచారు యువకులు. మారీచుడు క్రోధంతో లేచి నిలబడి అక్కడ ఉన్న వారితో కలియబడేంతలో అతని మీదపడి ఒడిసి పట్టుకొని నిలేశారు.

అగస్త్యుడికి ఎక్కడలేని సంతోషం కలిగింది. తాటక వన ముఖ్యులు ఇంత తేలిగ్గా తనకు దొరుకుతారనుకోలేదు. అగస్త్య పరంపరుల విజయాల్లో ఇదొకటి చేరబోతుంది గర్వంతో గడ్డాన్ని నిమురుకుంటూ తాటకవైపు, మారీచుని వైపు చూశాడు.

“వీడిని రాక్షసుడిని కమ్మని ఈ అగస్త్యుడు శపిస్తున్నాడు” అన్నాడు గంభీరమైన కంఠంతో. అంత రణగొణ ధ్వనిలో సైతం అగస్త్యుడి కంఠం లోని వెటకారం అందరికీ అర్థమయ్యింది.

మారీచుడిని గట్టిగా పట్టుకున్నారు. కత్తి పట్టుకొని వచ్చి ఒకడు మారీచుడికి శిరోముండనము చేయడానికి ప్రయత్నించసాగాడు. మారీచుడు గింజుకుంటు, విదుల్చుకుంటూ ఉంటే అక్కడక్కడ తెగి నెత్తురు ముఖం మీదుగా కారసాగింది. కొంతమంది వెకిలిగా నవ్వుతూ మారీచుడి ముఖమంతా, ఒళ్లంతా మసి పూయడం ప్రారంభించారు. మరి కొంత మంది అతడి మొలచుట్టూ ఉన్న నారవస్త్రాన్ని తొలగించి మసి పూయ సాగారు. ఒకడు అక్కడున్న బూడిదతో ఒళ్ళంతా బొట్లు పెట్టడం మొదలు పెట్టాడు.

ఆ దృశ్యాన్ని చూడగానే తాటక దు:ఖాన్ని మరిచిపోయింది. దాని స్థానంలో ముప్పిరిగొన్న ఆవేశం ఆక్రమించింది. పెద్ద గొంతుతో వేసిన

పెనుకేక అక్కడి వారిని స్థాణువుల్లా చేసింది.

"అగస్త్యుడా నీ పేరు? మేం చేసిన తప్పేమిటి? ఈ వనాల్ని కలుషితం చేస్తుంటే అడ్డుకోవడమా. అయితే పెంపుడు జంతువుల్లా మీకు దాస్యం చేయాలి. లేదా చావాలా? మేం కాదురా చచ్చేది. మీరు...! ఒక్క పిడికిటి పోటుతో నిన్ను చంపగలను" అంటూ గుండెలు బాదుకుంటూ అరిచింది. అగస్త్యుడు తొణకలేదు.

"మతిలేని ఆడదానా! నీ ఆకారం, బలం నీకు గర్వాన్ని కలిగిస్తున్నాయి. దీన్ని వికారంగా, వికృతంగా మారమని శపిస్తున్నాను" అన్నాడు అగస్త్యుడు.

అగస్త్యుడి సూచన శిష్యులకు అర్థమయింది. చేతికి దొరికిన వస్తువులతో ఒక్క ఉదుటున ఆమె మీద పడ్డారు. ఎడాపెడా బాదారు. ఆమె ముఖాన్ని లక్ష్యంగా చేసుకున్నారు. చెంపలు చీరిపోయాయి. పండ్లు రాలిపోయాయి. ముక్కు చితికిపోయింది. కండ్లు సొట్టపోయాయి.

"వేట మాంసం తిని తిని బాగా బలిసిందిరా ఇది" అన్నాడొకడు కసిగా.

"ఇకనుండి ఇది నరమాంస భక్షణ చేస్తుంది" అన్నాడు అగస్త్యుడు అదే శాసించే గొంతుతో కొంత హేళన ధ్వనింపచేస్తూ.

హఠాత్తుగా తనపై జరుగుతున్న దాడి ఆమెను వివశత్వం లోకి నెట్టివేసింది. మారీచుని పెనుగులాడుతున్న గొంతు తాటకను క్రోధితురాలిని చేసింది.

"నరమాంస భక్షణ నీతోనే ప్రారంభిస్తానురా" అంటూ తన చుట్టూ ఉన్న వారందరిని నెట్టివేసింది. పెద్ద పెట్టున అరచింది. ఆ అరుపు ఈ భూమ్మీద పుట్టిన ఏ జంతువుదో చెప్పడం కష్టం. తన మనుషుల

భయంకరమైన చావు, గింజుకుంటున్న కొడుకు గొంతు, హింసిస్తున్న మనుషుల సమూహం మధ్య కలిగిన ఉన్మాదం, రౌద్రం వేయి ఏనుగుల బలాన్నిచ్చింది. చేతికి దొరికిన వారిని దొరికినట్టు విసిరేసింది.

ఏది దొరికితే దానితో ఎడాపెడా బాదింది. ఆమె మృత్యు రూపమే అయ్యింది. తన రక్తం ఎదుటి వాళ్ల రక్తం ఆమె ఒంటి మీద కలిసి పోయాయి. ఆమెను తేరిపారా చూడాలంటేనే భయం గొలిపే విధంగా ఉంది. నిర్దాక్షిణ్యంగా ఒక్కో దెబ్బతో ఒక్కో తల పగుల గొట్టేసింది. ఆశ్రమవాసుల విజయ ధ్వానాలు, హాహాకారాలుగా మారాయి.

మారీచుడిని పట్టుకున్న వాళ్ల పట్టు సడలింది. అతడూ విజృంభిం చాడు. ఆ సమయంలో వారిద్దరూ మృత్యు విహారమే చేసారు. తలలు పగిలిన వాళ్లు నడుములు విరిగిన వాళ్లు కాళ్లకు తగులుతుంటే భూమి అదిరేలా వాళ్లను కాళ్లతోనే తొక్కి చంపేసారు. దొరికిన వాళ్లను ఉట్టి చేతులతోనే చీల్చేసారు. పారిపోతున్న వాళ్లను వెంటపడి మరీ చితక్కొట్టారు.

ఇంతలో తాటక వనవాసులు అక్కడికి పరుగున చేరుకోవడం మొదలు పెట్టారు. అగస్త్యుడు ఎపుడు పారిపోయాడో ఎవరికి తెలియదు. తాటక విజృంభణ చూడగానే వస్త్రం జారిపోతున్నా పరుగు లంకించు కున్నాడు. గొడవ మొదలయిన వెంటనే ప్రమాదం గ్రహించిన లోచనుడు అష్టకున్ని లాక్కుంటూ పారిపోయాడు.

ఆశ్రమవాసులు ప్రతిఘటన వదిలి పారిపోవడం మొదలు పెట్టారు. తాటక అనుచరులు పారిపోతున్న వాళ్లను సైతం వదిలి పెట్ట లేదు. చేతికి దొరికితే చాలు రాతి గదలతో చితక్కొట్టారు.

చంపుతున్న వాళ్ల ఉన్మాద కేకలతో, చస్తున్న వాళ్ల భయ విహ్వల రోదనలతో అడవి మారుమ్రోగింది. అడవిలో చాలా దూరం మేర

అక్కడక్కడ మానవ కళేబరాలు పడి ఉన్నాయి. రక్తం చారికలతో వనం భయంకరంగా మారింది.

"ఈ వనాన్ని నిర్ధూమం చేస్తాను" అంటూ దిక్కులు పిక్కటిల్లేలా తాటక చేసిన భీకరమైన ప్రతిజ్ఞ కొనప్రాణాలతో పారిపోతున్న వాళ్లని మరింత వణికేటట్లు చేసింది. అనంతర కాలంలో అది గంగా తీరమంతా వ్యాపించింది.

తాటక ఆమె మనుష్యులు మలద కరూశాల్లోని ప్రతీ ఆవాసాన్ని ధ్వంసం చేసారు. రాత్రి పొద్దుపోయే వరకు ఇది కొనసాగింది. ప్రాణాలు కోల్పోయిన తమ సన్నిహితుల శవాల వద్దకు కోపం తీరిన, అలసిన దేహాలతో చేరుకుంది తాటక బృందం. బోరున విలపించారు.

సుందుడి మరణం, దానికి తోడు. అగస్త్యుడి మనుషులు చేసిన లోతైన గాయాలు తాటకను తీవ్రంగా రోదించేటట్లు చేసాయి. మారీచుడు ఆమెకు ఉపచారాలు చేసాడు. ఆమె ముఖం పచ్చి మాంసపు ముద్దలా ఉంది.

పోరులో చనిపోయిన తాటక వనవాసుల శవాలను పూడ్చి పెట్టారు. సుందుడి శవంతోపాటు తాటక కొత్తగా తయారు చేసుకున్న రాతి గొడ్డలిని పెట్టారు. అడవిలో సేకరించిన గుప్పెడు ధాన్యపు గింజలను, ఎండిన పళ్లను ఒక తోలుసంచిలో పెట్టి ఉంచారు. మరొక తోలుసంచిలో నీరు ఉంచి ఖననం చేశారు. కూలగొట్టిన గుడిసెలకు నిప్పు పెట్టారు. ఆ నిప్పులోకి ఆశ్రమవాసుల శవాలు విసిరేశారు.

***

## - 6 -

ఆ వనాన్ని తాటక నిజంగానే నిర్ధూమం చేసింది. హోమాగ్ని అక్కడ మళ్లీ ఎప్పుడూ వెలగలేదు. కొత్త మనిషిని ఒక్కరినీ అడుగు పెట్టనీయలేదు. దారితప్పి వచ్చిన వాళ్లను సైతం పారిపోయేటట్లు చేసింది తాటక బృందం. తాటక ప్రశస్తి గంగా తీరమంతా వ్యాపించింది. వుట్టి చేతులతో ఒక్కతే చేసిన వీర విహారం గురించి జనం కథలు కథలుగా చెప్పుకునేవారు.

ఆరోజు జరిగిన దాడి వల్ల తాటక ముఖం వికారంగా మారింది. పెదవి తెగిపోయి ముక్కు పగిలిపోయి కన్ను సొట్టబోయి ముఖమంతా లోతైన గాయాల గాట్లతో మొదటి చూపులోనే భయం గొలిపేలా ఉంటుంది తాటక.

"ఆర్యావర్తవాసుల ఆగడాలకు, ఘాతుకాలకు నిలువెత్తు సాక్ష్యం తాటక" అంటుంటాడు చిత్రరథుడు. తెగలోనికి లోహాన్ని ప్రవేశపెట్టాలని ప్రయత్నించాడు అతడు. కాని తీవ్రమైన ప్రతిఘటన ఎదురయ్యింది. ఇనుమును తమ పరిసరాల్లోకి అనుమతించే వారు కాదు. అది అరిష్టానికి అధిష్టాన దేవతగా భావించేవారు.

సంవత్సరాలు గడిచే కొద్ది తాటక వనం చిక్కటి అడవిగా మారింది. ఆ ప్రదేశంలోకి ఇతరుల రాకపోకలు నిషిద్ధమయ్యాయి. మారీచ, సుబాహులకు ఇతర పిల్లలకు స్వయంగా తాటకనే ఆయుధ ప్రయోగా

ల్లోనూ, వేటలోనూ మెలకువలు నేర్పింది. మారీచ సుబాహులు సిద్ధాశ్రమంలో సుశిక్షితులైన నాయకులయ్యారు. తాటక సిద్ధాశ్రమాన్ని వదిలి తాటక వనంలోనే ఉండసాగింది.

తాటకతో పాటు కొద్దిమంది సహచరులు ఆ వనంలో ఉండ సాగారు. వారి ప్రశాంతతకు భంగం కలగకుండా కొంతదూరంలో కొంతమంది నాగులు ఉండసాగారు. వారు తాటక పట్ల అత్యంత గౌరవ ప్రపత్తులతో ఉండేవారు.

సంవత్సరాలు గడిచాయి. కొంతకాలం తర్వాత కొన్ని మార్పులు చోటు చేసుకున్నాయి. ముగ్గురు, నలుగురు వర్తకులతో కూడిన చిన్న చిన్న వ్యాపార బృందాలు ధాన్యం, ఉన్ని, నూలు వస్త్రాలు, పూసల హారాలు, తీపి పదార్థాలతో సిద్ధాశ్రమానికి వచ్చి వెళ్లేవారు. ప్రతిగా జంతుచర్మాలు, ఏనుగు దంతాలు, తేనెను తీసుకునేవారు. సిద్ధాశ్రమం సమీపం నుండి దూరప్రాంతాలలో ఉన్న చిన్నచిన్న రాజ్యాలవైపు వ్యాపారులు వెళ్లి వచ్చేవారు. మారీచుడు వాళ్లని సిద్ధాశ్రమంలోకి అనుమతించేవాడు కాదు. వాళ్లను సిద్ధాశ్రమానికి కొంతదూరంలో ఒక సంకేత స్థలంలో నిలిపి ఉంచేవాడు.

వారి రాక తెలుసుకుని సిద్ధాశ్రమ వాసులు వస్తుమార్పిడి చేసుకునేవారు.

మారీచుడు సూక్ష్మగ్రాహి. బయట ప్రపంచంలో జరుగుతున్న పరిణామాలను తెలుసుకోవడానికి ఈ సంకేత స్థలాలు సహకరిస్తాయని గుర్తించాడు. వర్తకుల ద్వారా సమాచారం తెలిసేది. ఇది ఒక లాభం. అయితే తమ విషయాలు కూడా పణుల ద్వారా బయటి ప్రపంచానికి తెలిసే అవకాశం ఉండడం నష్టాన్ని కలిగిస్తుందని అనుకునేవాడు.

వర్తకులైన పణుల వేషభాషల్లో ఉండే స్వల్పమైన మార్పులను సైతం మారీచుడు కనిపెట్టేవాడు. వాళ్ల వస్త్రాల్లో దళసరితనం తగ్గి అల్లికలు నాజూకుతనం మెల్లమెల్లగా పెరగడం గమనించాడు.

వాళ్లు ధరించే వస్త్రాల నాజూకుతనం నాణ్యత పెరుగుతున్న కొద్దీ వాళ్ల కుటిలత్వం పెరగడం చూసి ఆశ్చర్యపోయేవాడు.

తేరగా ఎక్కువ మొత్తంలో వస్తువుల్ని కొట్టేయడానికి ప్రయత్నిస్తుం డేవారు. గతంలో అలా ఉండేది కాదు. ఒక్కోసారి వీళ్లు లాభపడుతుండే వాళ్లు. మరోసారి వాళ్లు లబ్ధి పొందేవాళ్ళు. ప్రస్తుతం అలా కాదు. కొన్నిసార్లు తెచ్చిన వస్తువుల్ని సైతం వర్తకులు వెనక్కి తీసికెళ్తున్నారు కూడా. ఇది కొత్త విషయం.

కాలం గడుస్తున్న కొద్ది చిన్న చిన్న బృందాలు అక్కడక్కడ ఆశ్రమా లు నిర్వహించుకుంటున్నారు. అవి ప్రధానంగా వర్తకులకు ఆశ్రయాలుగా మారుతున్నవి. ఎక్కడ యాగాలు నిర్వహించబడడం లేదు. దాని పర్యవసానాలు అందరికి తెలుసు.

తాటకకు వృద్ధాప్యం వచ్చింది. వయసు మీద పడుతున్న కొద్ది మరింత ఒంటరిగా ఉండసాగింది. ఆమె సహచరులు కొంతమంది తాటక వనంలో ఉంటూ ఆమెకు చేదోడు వాదోడుగా ఉండసాగారు. మారీచ సుబాహులు అపుడపుడు వచ్చి ఆమె యోగక్షేమాలు తెలుసు కుంటున్నారు.

అది వేసవికాలం చెట్ల నీడలు ఎండ ప్రభావాన్ని తగ్గిస్తున్నాయి. అయినా గాలిలోని వేడికి చెమటలు ధారాపాతంగా కారుతున్నాయి. గాలి వీచినపుడల్లా సౌఖ్యమంటే ఏమిటో తెలిసి వస్తుంది. మారీచుడు తల్లి కిష్టమని కొన్ని పళ్లను తోలుసంచిలో వేసుకొని తీసుకవచ్చాడు.

తాటక ఆవాసం బయట మ(ర్రి చెట్టు మొదట్లో కూర్చున్నాడు. తాటక ఆవాసం వెదురుతోను ఆకులతోను తయారు చేయబడిన చిన్న గుడిసె. ఆ వనంలో అలాంటివి ఇంకా కొన్ని ఉన్నాయి. అవి తాటక సహచరు లివి. మారీచుడికి నిద్ర ముంచుకొచ్చింది.

నిద్రపోయి ఎంత సేపయిందో తెలియదు కాని తన సమీపాన అలికిడి వినిపిస్తే దిగ్గున లేచి కూచున్నాడు. తాటక ఆమె సహచరులు మారీచుడికి చుట్టూ కూర్చుని కాలక్షేపం కోసం ఏదో ఒకటి మాట్లాడు కుంటూ ఉన్నారు. అతని సంచిలోని పండ్లను అప్పటికే తినేసారు. ఒళ్లెరగకుండా వాళ్లముందు పగటి నిద్ర పోయినందుకు మారీచుడు సిగ్గుపడ్డాడు.

పరిసరాలన్ని దట్టమైన చెట్లతో రకరకాల పూలతో శరీరానికి మనసుకు స్వాంతన కలిగిస్తున్నాయి. మానవ సంబంధమైన ఏ రణగొణ ధ్వని లేకుండ ప్రకృతి కోలహలం మాత్రమే వినిపిస్తోంది. ఎవరైనా సరే, తాటక వన ప్రశాంతతను భగ్నం చేయడం నిషిద్ధం. అది వన నియమం. ఆ నియమాన్ని కాపాడడానికి నాగులు ఎల్లప్పుడు జాగరూకులై సంచరిస్తుంటారు.

తాటక వృద్ధురాలైనప్పటికీ ఆ అడవి మొత్తానికి ఆమె ఆరాధ్యు రాలు. ఆమె ఆశీర్వాదం వల్లనే తమకు జరుగుబాటు అవుతుందని సిద్ధాశ్రమవాసులు విశ్వసిస్తారు. చేతిలో కర్ర సహాయంతో నడుస్తూ పచార్లు చేయసాగింది తాటక. నడుం పూర్తిగా వంగకున్నా చేతి కర్రను ఊతంగా పట్టుకోవడం ఆమెకు అలవాటయింది. గత కాలపు గాయాల గుర్తులతో ముఖం వికారంగా ఉన్నప్పటికి ఆమె కళ్లు ప్రకాశవంతంగా ఉన్నాయి. జట్టు మొత్తం తెల్లబడి ఉంది. నార వస్త్రం ధరించింది.

నడవడం ఆపిన తాటక మారీచుని వద్దకు వచ్చి నిలబడింది.

"పరుల సంచారం మళ్లీ అధికమవుతున్నట్లుంది" అడిగిందొక వృద్ధురాలు. కొంత చర్చ జరిగిన తర్వాత తాటక చెప్పింది.

"పరాయి వాడనే కారణంగా దాడికి ఎగబడవద్దు. అలాగని మన ఆవాసాల్లోకి చొచ్చుకు వస్తుంటే, హీనమైన ఇంద్ర పూజల్ని చేస్తుంటే చూస్తూ ఊరుకోవద్దు. మన సిద్దాశ్రమ పూర్వీకుడు బలి సంగతి గుర్తుంది కదా. మూడడగుల నేల చాలని, మూడు ఆవాసాలు కోరుకుని, మూడు ఆశ్రమాలు నిర్మించుకుని ఆర్యావర్తవాసులు తామరతంపరగా పెరిగిపోయి బలిని తరిమేశారు. దిగువకు పారిపోయేలా చేశారు. మళ్లీ సిద్ధాశ్రమం మన వాళ్ళ చేతికి రావాలంటే ఎంత కాలం పట్టింది! ఇప్పుడిప్పుడు కుదురుకున్నాం. అయినా ఆర్యవర్తవాసుల ఆశ్రమాలు అక్కడక్కడ మిగిలే ఉన్నాయి. ఈ ఆర్యవర్తవాసులు పరమ కుటిలురు. ఆశ్రయమిచ్చిన వారినే హతమార్చగలరు. వాళ్ళు పరమ దుర్మార్గులు. వాళ్ళ ఆశలకు అంతే లేదు. సమస్త అడవి వాళ్ల సొంతం కావాలి. సమస్త మనుషులు వాళ్లకి దాస్యం చేయాలి. దాస్యం కన్న హీనమైన దశ మరొకటి ఉండదు. మన తెగ ఎవరికి లోబడకుండా ఉండడం కోసం ఇతర తెగలతో పోరాడినాం. ఇపుడు ఇంద్రుడే వచ్చినా పోరాడాలి" అంది తాటక ఉపదేశిస్తున్నట్లుగా.

కొంతసేపటి దాక మారీచుడు ఏమి మాట్లాడలేదు.

"మనవాళ్లంతా ప్రశాంతంగా ఉంటున్నారు తల్లీ. అలాగని అజాగ్రత్తగా లేము. అయితే ఇంత విశాలమైన అడవిలో ప్రతీవారి ఆగమనం తెల్సుకోవడం కష్టమే అయినప్పటికి మనవాళ్ల భద్రతకు మాత్రం నష్టం రానివ్వడం లేదు. ఈ మధ్య వర్తకుల రాక ఎక్కువవుతుంది.

వాళ్లు మన ఆవాసాల పరిసరాల దాకా రాకుండానే సుదూరంగా ఉన్న దారుల గుండా కామరూపానికి, మిథిల ప్రాంతాలకు వెళుతూ వస్తున్నారు. వాళ్లతో ఏ ప్రమాదం ప్రస్తుతానికి లేదు. ఉంటే వాళ్లను కట్టడి చేయడం అసాధ్యమేమి కాదు. ప్రమాదం మరీ ఎక్కువయితే అన్ని తెగలను ఏకం చేయవచ్చు" అన్నాడు మారీచుడు. తన తల్లి వింటుందో లేదోనని ఆమె కేసి ఒక్కక్షణం చూసాడు. మళ్లీ చెప్పడం ప్రారంభించాడు.

"తెగలన్ని విడివిడిగా ఉన్నా నెత్తిన ప్రమాదం ముంచుకొచ్చినపుడు ఒక్కటై శత్రువుల్ని గతంలో తరమగలిగినాము. ఇపుడంతటి ఐక్యత సాధ్యమా అని అనిపిస్తోంది. మొలచుట్టూ కట్టుకునే బట్ట పీలికల కోసం రంగురంగుల పూసల కోసం రకరకాల తీపి కోసం మధువు కోసం పణులు ఎపుడు వస్తారా అని మన వాళ్లే ఎదరుచూస్తున్నారు. ఆహ్వానం పలుకుతున్నారు అయినే సరే నెత్తిన ప్రమాదం ముంచుకొస్తే తెగలన్నీ ఏకమవుతాయని నమ్మకముంది నాకు. అందులోను నీ వీరత్వం శక్తి యుక్తులు ఆర్యవర్తమంతటా వ్యాపించి ఉన్నాయి.

నీవు ఒక సైగ చేస్తే చాలు చాలా తెగలు మనతోపాటు కలిసి వస్తాయి. కాని ఇప్పటికైతే అంత అవసరం కనిపించట్లేదు" అన్నాడు మారీచుడు.

సూక్ష్మగ్రాహి అయినప్పటికి మారీచుడు తాటక ఉపదేశాన్ని సరిగా గ్రహించ లేపోయాడు. ప్రమాదమేదో పొంచి ఉన్నట్టు తాటకకు సందేహంగా ఉంది. దాన్ని నిర్ధారించుకోవడం కష్టమే.

అస్పష్టంగా వ్యక్తం చేసిన సందేహాన్ని మారీచుడు అర్థం చేసుకోలేక పోయాడు. అందుకు తాటక వనం, సమీప తెగలు తొందరలోనే మూల్యం చెల్లించుకున్నాయి.

## - 7 -

అగస్త్యుని బృందం పై తాటక దాడి చేసి మలద కరూశాలను ధ్వంసం చేసిన సంఘటనలో పారిపోయి ప్రాణాలు దక్కించుకున్న అతి కొద్ది మందిలో లోచనుడు, అతడి కొడుకు అష్టకుడు ఉన్నారు.

అష్టకున్ని తీసుకుని లోచనుడు చాలా ప్రాంతాలు తిరిగాడు. ఎంత తిరిగినా అష్టకుడి మనసు మాత్రం స్థిమిత పడలేదు. సరయుకు వాయువ్య దిశగా ప్రయాణం చేశారు. హస్తినపురం చేరుకుని అక్కడ కొంత కాలం ఉన్నారు. అక్కడి నుండి కురుజాంగల దేశం మీదుగా ప్రయాణించి పాంచాల దేశం చేరారు. ఆ దేశంలో చాలా రోజులు ఉన్నారు. అష్టకుడు రకరకాల పనులు చేశాడు. కొంత కాలం పశువుల శాలలోను, మరికొన్ని రోజులు వడ్రంగుల వద్ద, కమ్మరుల వద్ద పనిచేశాడు. ఎక్కడా కుదురుగా ఉండలేకపోయాడు. లోచనుడు మాత్రం పాంచాల దేశంలోని ఒక రాచకుటుంబంలో హవ్యుడిగా స్థిరపడ్డాడు.

ఒక సంవత్సర కాలం బాగానే గడిచింది. అంతా కుదురు కుంటుం దనుకుంటున్న తరుణంలో లోచనుడు తీవ్రంగా జబ్బుపడ్డాడు. వైద్యులు చేసిన చికిత్సలు కొంతమేర పనిచేశాయి గానీ జబ్బు తీవ్రతను

తగ్గించలేకపోయాయి.

ఎవరో చెప్పిన మీదట అక్కడికి కొంత దూరంలో ఉన్న శరదండా నదీ తీరానగల పిప్పలుడి వైద్యాశ్రమానికి లోచనుడిని తీసుకువెళ్ళాడు అష్టకుడు.

అది అష్టకుని జీవితాన్ని మలుపు తిప్పింది. పిప్పలుడి వైద్యం తండ్రిని స్వస్థపరిచింది. వైద్యవృత్తిలోకి ప్రవేశించడం అష్టకుడి మనసును స్వాంతన పరిచింది.

పిప్పలుడి ఆశ్రమం విలక్షణంగా ఉంది. శరదండానదీ తీరానికి సమీపంలో విశాలమైన స్థలంలో చుట్టూ పూలు లతలతో రమణీయంగా ఉంటుంది. పిప్పలుడు, అతని వద్ద ఉన్న పనివాళ్ళు ఎప్పుడూ పనిలోనే నిమగ్నమై వుంటారు. మూలికలు సేకరించడం, నూరడం, భద్రపరచడం ఇవి ముఖ్యమైన పనులు. చుట్టు ప్రక్కల నుండి వచ్చే రోగులను చూసుకోవడం, వారికి పిప్పలుని సూచనల ప్రకారం సరియైన పాళ్ళలో మందులు ఇవ్వడం. రోజులు ఎలా గడిచిపోతున్నాయో తెలియనంత పని ఒత్తిడి ఉంటుంది.

వైద్యం కోసం లోచనుడిని తీసుకొని వచ్చిన అష్టకునికి అక్కడి వాతావరణం నచ్చింది. నిజానికి వైద్యశాలలో రోగుల్ని ఎక్కువ రోజులు ఉండనివ్వరు. వారి ఆలన పాలన చూసుకోవడం, అన్ని వసతులు కల్పించడం కష్టం. కాని అష్టకుడు వచ్చిన మొదటి రోజు నుండే తీరిక సమయాల్లో పిప్పలుడి సహాయకులకు చేదోడు వాదోడుగా ఉండడం వల్ల పిప్పలుడు అభ్యంతరం చెప్పలేదు.

పిప్పలుడి అనుమతి తీసుకుని అష్టకుడు దగ్గరలో రెండు రోజుల్లోనే చిన్న గుడిశెను నిర్మించుకున్నాడు. లోచనుడు కోలుకుంటున్న క్రమంలో

పిప్పలుడి ఆవుల్ని, మేకల్ని చూసుకోవడం మొదలు పెట్టాడు. క్రమంగా అది చిన్నపాటి మందలాగా తయారయింది. గతంలో కన్నా అవి మంచి ఆరోగ్యంగా, పుష్టిగా తయారయ్యాయి. పాలకు, పెరుగుకు లోటు తీరింది.

అష్టకుడికి అమితమైన సంతోషాన్ని చేకూర్చినది మరొకటుంది. అది కేవలుడి స్నేహం. కేవలుడు పిప్పలుడి కొడుకు. అష్టకుడి ఈడువాడే. ఇద్దరూ ఒకే కడుపున పుట్టిన అన్నదమ్ముల్లా ఆప్యాయంగా ఉండేవారు. కలిసి తిరిగేవారు. ఆటలాడేవారు.

పిప్పలుడు, అతడి భార్య కంసవతి... ఇరువురు అష్టకుడిని కేవలుడితో సమానంగా చూసేవారు. తల్లి ప్రేమంటే ఏమిటో అష్టకుడికి అనుభూతి కాసాగింది.

కేవలుడు బాల్యంలో చాలా దుందుడుకు పిల్లవాడుగా ఉండే వాడు. అతడి అల్లరికి అంతు ఉండేది కాదు. చెట్టు కొమ్మలపై నుండి కోతిలా గెంతేవాడు. అది కేవలుడికి ఇష్టమైన క్రీడ. ఒకసారి మరీ ఎత్తున ఉన్న మర్రి చెట్టు ఊడల్ని పట్టుకుని వేలాడుతూ పట్టుదప్పాడు. కింద పడిపోతుంటే తల ఒక కొమ్మను బలంగా ఢీకొంది. నేలకు జారి కుడికాలు విరగ్గొట్టుకున్నాడు. మోకాలు చితికి పోయింది. తీవ్రంగా గాయపడ్డాడు. తండ్రి వైద్యం అతన్ని ప్రాణాపాయ స్థితి నుండి బయట వేయగలిగింది. కాలి ఎముకలు సరికావడానికి చాలా కాలం పట్టింది. పూర్వపు స్థితికి మాత్రం రాలేదు.

కేవలుడికి అష్టకుడు ప్రాణ మిత్రుడయ్యాడు. ఇద్దరు కలిసి పిప్పలుడి పనుల్లో చురుగ్గా పాల్గొనేవారు. వారిద్దరు ఏకసంథాగ్రాహులు. ఉత్సాహం ఉరకలెత్తుతున్నవాళ్ళు. వైద్యసంబంధమైన వేర్లు, గడ్డలు, లతలు, పత్రాలు, పూలు, మొక్కలు అన్నీ వాళ్ళకి కొట్టిన పిండి.

శరదండానదీ తీరంలోని అరణ్యాలు, పల్లెల్లోని ప్రతి మొక్క వారిద్దరికి తెలిసిపోయాయి. రోగ నిర్ధారణలు వేగంగా చేయడం సరి యైన పాళ్ళలో ఔషధాల్ని తయారుచేయడం చూసి పిప్పలుడు గర్వంతో పొంగిపోయే వాడు.

లోచనుడి ఆనందానికయితే అంతే లేదు. చేతి నిండా పని ఉంది. వైద్యుడి శిష్యుడిగా కొడుకు రాటుదేలుతున్నాడు. ఆ పనిలో వాడు సంతృప్తిగా ఉన్నాడు. వృత్తి వరకు అంతా సవ్యంగా ఉంది. ఇంతవరకైతే తనకు పిప్పలుడు దైవంతో సమానం.

కాని ప్రవృత్తి విషయంలో మాత్రం పిప్పలుడి ఆలోచన ధోరణి లోచనుడికి కలవరం కలిగిస్తోంది. పోయి పోయి లోకాయత వాది వద్దకా నా కొడుకును చేర్చింది? పని ఒత్తిడి వాడిని ఆ పాపపు భావజాలం నుండి కాపాడుతోంది. ఒకటి రెండు సార్లు ఇక్కడి నుండి వెళ్ళిపోదామని చెప్పిచూశాడు. 'కలలో కూడా అట్లాంటి ఆలోచన చేయకు' అన్నాడు అష్టకుడు. నిజానికి ఇంతకన్నా మంచి జీవిక, వాతావరణం, మనుషులు దొరకరని తెలుసు తనకు. దైవం మీద భారం వేసి ఊరుకున్నాడు. ఇంక చేసేది ఏముందిలే అనుకున్నాడు లోచనుడు.

* * *

పల్చటి నూలు వస్త్రంతో కషాయాన్ని వడకట్టుతున్న అష్టకున్ని చూస్తూ పాత విషయమేదో గుర్తుకు వచ్చి నవ్వుకున్నాడు పిప్పలుడు. అష్టకుడు చూడనే చూశాడు.

"కషాయం తయారీలో నా వల్ల పొరపాటు ఏమీ జరగడం లేదు కదా, గురువర్యా?" అన్నాడు తడబడుతూ.

"లేదు లేదు అష్టకా. ఏదో చిన్ననాటి సంగతి గుర్తుకు వచ్చింది"

అన్నాడు పిప్పలుడు.

కేవలుడు పరుగెత్తుకుంటూ వచ్చాడు.

"చెప్పు నాన్నా, ఏమిటి మీ చిన్నప్పటి విశేషం? ఇదివరలో నాకు చెప్పిందేనా?" అంటూ ఆసక్తిగా అడిగాడు.

"ముందు మీరు పనులు పూర్తి చేసి రండి, అప్పుడు మాట్లాడు కుందాం, ఔషదం తయారీని మధ్యలో వదిలేసి చేస్తే గుణంలో దాని ప్రభావం కనపడుతుంది" అన్నాడు పిప్పలుడు.

మళ్ళీ వాళ్ళు పనుల్లో నిమగ్నమయ్యారు. అష్టకుడు ఇక్కడకు వచ్చిన మొదటి రోజు గుర్తుకు వచ్చింది పిప్పలుడికి. లోచనుడు జబ్బుతో ఉన్నాడు. అష్టకుడిని చూసిన మొదటి చూపులోనే, మాట్లాడిన కొంత తడవులోనే అతడిలో రగులుతున్న మంటను గుర్తించాడు. దాని వెలుగు అతని కళ్ళలోను, దాని చిటపటలు అతని ముఖంలోను కనిపించాయి.

అందుకే శిష్యునిగా స్వీకరించమని అష్టకుడు కోరినప్పుడు కాదనలేకపోయాడు. తండ్రి ఆమోదం మాత్రం తీసుకోమన్నాడు.

కేవలుడితో అష్టకుడికి గల మైత్రిని చూస్తే ఎంత సంతోషం కలుగుతుందో ! కంసవతి అయితే వాళ్ళతో "ఒక కొడుకు నా కడుపున పుడితే ఇంకో కొడుకును దేవుడు పంపాడు" అంటుంది.

'దేవుడా?' అని తాను ప్రశ్నిస్తున్నట్లు అంటే "అవును, దేవుడు, దయ్యం మీకు లేకపోవచ్చు. నాకు దేవుడు ఉన్నాడు. నా నమ్మకాలు నావి" అంది నవ్వుతూ.

మిత్రులిద్దరు పనులు పూర్తిచేసుకుని వచ్చారు. పిప్పలుడు తన కుటీరంలో గోడకు వీపు ఆనించి విశ్రాంతిగా కూర్చున్నాడు. కేవలుడు, అష్టకుడు చెరోపక్క కూర్చుని చెప్పమన్నట్లు చూస్తున్నారు.

"మీరు ఇవాళ వదిలేలా లేరు" అన్నాడు. "చెప్పు నాన్న, అప్పటి ముచ్చటేదో" అంటూ గారాలు పోయాడు కేవలుడు. వాడికి తండ్రి చెప్పే ముచ్చట్లంటే తెగ ఆసక్తి.

"సరే చెప్తాను. అప్పుడు నా వయసు పదో, పన్నెండు సంవత్సరాలో ఉంటాయి. నేను నా స్నే..." చెప్పబోతుంటే కంసవతి మూడు మట్టి పిడతల్ని లేసుకు వచ్చి వాళ్ళ ముందర పెట్టింది. బెల్లం, నెయ్యిల కమ్మని వాసన ముక్కు పుటాలను తాకింది.

"పురోడాశం, తీసుకోండి" అని వెళ్ళబోయింది. నవ్వు ఆగింది కాదు పిప్పలుడికి. పడీ పడీ నవ్వాడు. నవ్వు ఆపుకోవడానికి ప్రయత్నిస్తు విఫలమై నవ్వుతున్నాడు.

"సమయానికి భలే తీసుకువచ్చావు. ఈ ముచ్చటకు సందర్భోచితమైన వంటకం" అన్నాడు నవ్వుతూ.

పిప్పలుడివైపు సంతోషంగా చూస్తూ కంసవతి కూడా వాళ్ళ చెంత కూర్చుండిపోయింది.

"చిన్నప్పుడు మిత్రులమంతా కలిసి దగ్గరలోని తోటలో ఆడుకునే వాళ్ళం. మా వాళ్ళలో వజ్ర అనేవాడు మహాకోతి. వాడు సుధాముడు అనేవాన్ని ఆట పట్టించాలనుకున్నాడు. తోటలో పాడుపడిన గృహమొకటి ఉండేది. అందులో ఒక సేవకుడి హత్య జరిగిందని వాడు దయ్యమై తిరుగుతున్నాడని చెప్పేవారు. మా కంత పట్టింపు ఉండేది కాదు. అక్కడే దాగుడు మూతలు ఆడేవాళ్ళం. సుధాముడు ఆ మొండి గోడల వద్దకు వెళ్ళినప్పుడు వజ్ర గొంతు మార్చి" ఏమోయ్ సుధామ రేపు ఈ పాటికి పురోడాశం తెచ్చి ఇక్కడ పెట్టు... ఎవ్వరికీ చెప్పొద్దు... పురోడాశం, పురోడాశం..." అంటూ భీకరంగా అరిచాడు. సుధాముడు భయంతో

బయటకు పరిగెత్తుకు వచ్చాడు. మమ్మల్ని చూసి 'మీకు ఇప్పుడేమైన మాటలు వినిపించాయా?' అని అడిగాడు. మేమంతా అమాయకత్వం నటిస్తూ 'మాకేం వినిపంచలేదు సుధామ' అన్నాం. వాడు అమ్మో దయ్యం అంటూ ఇంటి వైపు పరుగులంకించు కున్నాడు. పురోడాశం సంగతి వజ్రను అడిగాం మరుసటి రోజు వండుతానని సుధాముడి అమ్మ వాళ్లింటిలో అనడాన్ని వాడు ఆ ఉదయమే విన్నాడట.

సుధాముడి వాళ్ళ నాన్న ఆచార్యులవారు. వారు అరకొర వైద్యం తెలిసినవారు. వారు ఇచ్చే మందుల్లో ప్రఖ్యాతమైనది మలబద్ధకాన్ని పోగొట్టి విరేచనాలకు ఇచ్చే కషాయం. సమస్య వచ్చినప్పుడు పల్లెవాసులు కేవలం ఆ ఒక్క కషాయం కోసం మాత్రమే వచ్చేవారు. పాలతో కలిపి ఇచ్చే ఆ కషాయం ఎల్ల వేళలా వాళ్ళ ఇంట్లో తయారుగా ఉండేది. ఇది పనిచేస్తుందా, అని ఎవరైన సందేహం వ్యక్తం చేస్తే ఆచార్యుల వారు నవ్వుతూ ఒక మాట అనేవారు – 'నా కషాయం పేగుల్ని కూడా బయటకు తంతుంది'.

అయితే సుధామకు సగం చెవుడు. పురోడాశం పురోడాశం అంటూ వజ్ర అన్న మాటలు వీడికి కషాయం కషాయం లాగా వినిపించింది. ఒక వైపు దయ్యం భయం.

మాకు తరువాత తెలిసింది. సుధాముడు ఇంటికి పరుగెత్తి వెళ్ళి వాళ్ళమ్మను వాటేసుకుని 'అమ్మ దయ్యాలకు మలబద్దకం ఉంటుందా' అని భయం భయంగా అడిగాడట. వాళ్ళమ్మకు నవ్వాగలేదట. "ఉంటుందేమో, అయినా మీ నాన్న కషాయం ఇస్తే దయ్యాల మలబద్దకం కూడా వదుల్తుంది" అందట నవ్వుతూ.

తెల్లవారింది. సుధామ ఇంట్లో సంగతి మాకు తెలియదు. వజ్ర

ఒక తూరి వాళ్ళింటి వైపు వెళ్ళి వచ్చాడు. లొట్టలేస్తు చెప్పాడు –కమ్మటి నెయ్యి, తీపి వాసన సుధామ ఇంట్లోంచి వస్తోందిరా అని. మా అందరికి నోరూరింది. వజ్రను బతిమిలాడుకున్నాం, మాక్కూడా కొంత మిగల్చమని. సరేనన్నాడు. కాని వాడి మీద మాకెవరికి నమ్మకం లేదు.

కొంత సేపటి తరువాత చిన్న మట్టి పిడతను గుండెలకదుముకుని నక్కి నక్కి వస్తు సుధాముడు కనిపించాడు. మేం అక్కడక్కడ దాక్కున్నాం. ఆ పాడుపడిన ఇంట్లో వజ్ర నక్కి సిద్ధంగా ఉన్నాడు. వాడికి దగ్గరలోనే నేనున్నాను.

ఆ మట్టి పిడతను సుధామ అక్కడ పెట్టి తిరిగి వెనక్కి వచ్చాడు. వజ్ర వెంటనే దాన్ని అందుకుని గుటుక్కున తాగేశాడు. 'ఛీ పాడు కషాయం' అని అరిచాడు.

ఇంతలో సుధాముడి అమ్మ ఎప్పుడు వచ్చిందో ఎలా వచ్చిందో తెలియదు. పురోడాశం ఎత్తుకొస్తున్నాడని ఆమె అనుకొంది. వస్తూనే ఖాళీ పిడతను నేలకేసి కొడుతున్న వజ్రను పట్టుకుని నాలుగు గుద్దులు గుభీ గుభీ మని గుద్దింది. అందరం పారిపోయాం. నాతో పరిగెత్తుతు వస్తున్న మిత్రులు 'ఓరేయ్ పిప్పలా, వాడు కనీసం నీకన్నా పురోడాశం మిగిల్చాడురా' అని అడుగుతుంటే పరుగు ఆపి నవ్వీ నవ్వీ పొట్ట పట్టుకున్నాను. కిందపడి పొర్లుతూ నవ్వుతూ చెప్పాను. 'ఓరేయ్ అది పురోడాశం కాదురా, కషాయం... ఆచార్యుల వారి కషాయం' అని.

కొద్ది రోజుల దాకా ఆ సంఘటన తలుచుకుని తలుచుకొని నవ్వే వాళ్ళం. మాకు నవ్వు ఆగేది కాదు. వజ్రకు విరేచనాలు ఆగేవి కావు.

వజ్ర వాళ్ళ తల్లిదండ్రులు ఆచార్యుల వారితో గొడవకు దిగారు. "ఏమయ్యా ఆచార్యులు, రోగం లేకున్నా మా వాడికి కషాయం ఇచ్చి

పేగులు తోడేశావు కదయ్యా" అంటూ అరిచారు.

"చిన్న అయ్యవారే నయం. అడక్కుండా కషాయం ఇస్తున్నాడు. ఆచార్యుల వారు కషాయం కోసం ఎంత తిప్పించుకుంటారు ఇంటి చుట్టు" అందొకావిడ నోట్లో చెంగు కుక్కుకుని నవ్వు ఆపుకుంటూ.

"అమృత భాండం పట్టుకుని మోహిని తిరిగినట్లు సుధాముడుని కషాయం పిడతతో ఊరి మీదికి వదిలేశారు" అన్నారొకరు.

ఆచార్యుల వారికి అసహనం కలిగింది.

"ఒరేయ్ సుధామ, వాడికి కషాయం ఎందుకు ఇచ్చావురా?" అడిగారు కోపంగా.

"కషాయం వాడికి ఇవ్వలేదు, దయ్యానికి ఇచ్చాను" అన్నాడు భయపడుతు.

"కషాయం దయ్యానికిస్తే మా వాడికెందుకురా విరేచనాలవు తున్నాయి" అంటూ మీది మీదికి వచ్చాడు వజ్ర తండ్రి.

"మీ వాడికి దయ్యం పట్టిందేమో" అన్నారెవరో.

వజ్ర వాళ్ళమ్మ ముందుకొచ్చి చేతులాడిస్తూ

"కషాయం సంగతి వదిలిపెట్టమ్మా, నువు వాడిని గుద్దినందుకు పిల్లాడు దడుసుకున్నాడు. అందుకే విరేచనాలవుతున్నాయి. అట్లా కొట్టడమేనా?" అంది.

అప్పటి వరకు శాంతంగానే ఉన్న ఆచార్యుల వారికి కోపం నషాళానికి అంటింది.

"ఏమమ్మో, మాటలు జాగ్రత్తగా రానీ, నా కషాయాన్ని ఏమన్నా అంటే ఊరుకోను. మా ఇంటిదాని దెబ్బలకే విరేచనాలవుతున్నాయంటే సరే, ఇంకెవడన్న మలబద్ధకమని నా ఇంటి గడప తొక్కితే కషాయం

ఇవ్వను. దీంతో నాలుగు గుద్దులు గుద్దిస్తా” అన్నాడు గసపోస్తూ. ఆ గొడవ నవ్వులాటతో ముగిసిపోయింది.

ఆచార్యుల వారు అతి కష్టమ్మీద వజ్ర విరేచనాల్ని ఆపగలిగారు. కళ్ళు పీక్కుపోయి పొట్ట వీపుకంటి దీనంగా తయారయ్యాడు వజ్ర. వాడు సుధామతో

‘ఒరేయ్ ! నేను చస్తే దయ్యమై నిన్నే పట్టుకుంటారా’ అనేవాడు. ‘దయ్యంగా ఉన్నపుడు మలబద్ధకం వస్తే మాత్రం వీడి కషాయమే తాగురో’ అనేవాళ్ళం మేము. ఆ ప్రాంతంలో ‘కషాయం దెబ్బకు దయ్యం వదిలింది’ అనే కొత్త నానుడి పుట్టింది” అంటూ ముగించాడు పిప్పలుడు.

అతడు చెప్తునంత సేపు వాళ్ళు నవ్వుతూనే ఉన్నారు. నవ్వి నవ్వి వాళ్ళ కళ్ళకు నీళ్ళొచ్చాయి. అక్కడి వాతావణమంతా ఉల్లాసంతో నిండి పోయింది. అందరూ పురోడాశం తింటూ నవ్వుకున్నారు.

***

## - 8 -

భుజం మీద ఉన్న నూలు వస్త్రంతో మూతి తుడుచుకుంటూ పిప్పలుడు బయటకు వచ్చాడు. అతడి వెనకే అష్టకుడు వచ్చాడు. కుటీరం బయట కొద్దిదూరంలో వర్తులాకారంలో కూర్చోడానికి అనుకూలంగా ఉన్న కర్రమొద్దులు ఉన్నాయి. అప్పుడప్పుడు పిప్పలుడు తన మిత్రులతో కలిసి అక్కడ కూర్చుని చర్చిస్తుంటాడు. ఉల్లాసంగ ఉన్న పిప్పలుడు అక్కడికి వెళ్ళి కూచున్నాడు. అష్టకుడిని రమ్మని పిలిచి ఎదురుగా కూచోపెట్టుకున్నాడు. కేవలుడు వాళ్ళ అమ్మకు సహాయం చేస్తూ ఇంట్లోనే ఉన్నాడు.

సాయంకాలపు ఆకాశం. బూడిదరంగు కాషాయ వర్ణపు మిశ్రమాల మబ్బులు... చల్లటి గాలి... పూల పరిమళం... వారి మనసుని ఆనంద భరితం చేసాయి. పశువుల్ని తీసుకొస్తు అపుడే లోపలికి వచ్చిన లోచనుడు వాళ్ళిద్దరి వంక చిరునవ్వుతో చూసాడు. దూరంగా కట్టివేసే పనిలో ఉన్నాడు.

అష్టకుడు కాస్త సంశయంగా అడిగాడు.

"గురువర్యా! మీ చిన్నప్పటి పల్లెలోని తోటలో ఒక పాడుబడిన గృహముందని దానిలో ఒక సేవకుడి హత్యజరిగిందని అన్నారు. అది నిజమేనా?" అడిగాడు.

విభ్రాంతి పొందిన పిప్పలుడు అష్టకుడి వంక చూసాడు. నిండు యవ్వనంలో ఉన్న అష్టకునిలో ఉత్సాహం తొణికిసలాడుతోంది. కళ్ళు తేజోవంతంగా ఉన్నాయి. నల్లటి మీసాలు, చెంపల నిండుగా లేత గడ్డం అతని అందాన్ని ద్విగుణీకృతం చేస్తున్నాయి. భుజాల మీదుగా వేలాడుతున్న నల్లటి జుత్తు గాలికి అటుఇటు కదులుతూ అతని ముఖంతో ఆటలాడుకుంటోంది.

పిప్పలుడు ఏమి మాట్లాడలేదు. అలాగే తీక్షణంగా చూస్తుండి పోయాడు. తన బాల్యంలో జరిగిన ఒక సరదా సంఘటనను వాళ్ళకు చెప్పాడు. కాని అంత పెద్ద ముచ్చటలో తాను సూచనగా చెప్పిన సేవకుడి విషయాన్ని అష్టకుడు గుర్తుపెట్టుకుని అడగడం పిప్పలుడికి విస్మయాన్ని కలిగించింది. గురువుగారి ముఖంలో వచ్చిన మార్పును అష్టకుడు పసిగట్టగలిగాడు. విషయం గంభీరమైనదని అర్థమైంది. తనకు ఆ విషయం వినడం పట్ల ఆసక్తి ఉందని తెలియపరచడానికా అన్నట్లు ముందుకు వంగాడు అష్టకుడు. అతని కళ్ళలోకి సూటిగా చూస్తు

"ఈ ప్రపంచంలో అత్యంత ప్రమాదకరమైనది ఏదో తెలుసా ...?" అడిగాడు పిప్పలుడు.

కొంత నిశ్శబ్దము తర్వాత తానే తిరిగి అన్నాడు.

"జ్ఞానం!" అన్నాడు మళ్ళీ కొంత నిశ్శబ్దం.

"నిజానికి జ్ఞానం కూడా కాదు. దాన్ని వ్యక్తం చేయడం, అను ప్రయుక్తం చేయడం" గంభీరంగా తిరిగి అన్నాడు పిప్పలుడు.

అష్టకుడేమి మట్లాడలేదు.

"అష్టకా వైద్యుడిగా నువు బాగా రాణించగలవు. ఎందరి ప్రాణా ల్నో నిలపగలవు. వైద్యేతర విషయాలతో మనసు భారం చేసుకోకు. వెళ్ళు అష్టకా, మీ తండ్రి ఎదురు చూస్తున్నాడు" అన్నాడు పిప్పలుడు.

అష్టకుడు చిరునవ్వుతో

"ఒక సేవకుడి చావు గురించి తెలుసుకోవడం అంత ప్రమాదకరం గా పరిణమిస్తుందా? అతని చావుగురించి మీ పల్లెలో ఎందరికో తెలుసు. అందరూ సుఖంగానే ఉన్నారు కదా" అన్నాడు అష్టకుడు.

పిప్పలుడికి చిరాకు కలిగింది. "తైలంలో తడిపిన బట్టపేగును ఎన్ని చోట్ల పెట్టినా ఏమికాదు. నిప్పు దగ్గర పెడితే మాత్రం భగ్గు మంటుంది. ఏ యే విషయాలు ఎవరిలో అగ్నిని ప్రజ్వరిల్లింప చేస్తాయో ఎవరికి తెలుసు. సరే! అయితే విను. వాడొక దాసుడు. పాంచాల దేశపు రాజ పురోహితుడి వద్ద దాసుడు వాడు. ఆ రాజ పురోహితుడి వద్ద కొంత మంది బ్రాహ్మణ బాలలు పౌరోహిత్యం నేర్చుకునేవారు. వారు మంత్రాలు వల్లేవేస్తుంటే వారి ఈడు ఉన్న కన్న కొంచెం వయసులో పెద్ద అయిన ఈ దాసుడు పనులు చేస్తూ వింటుండే వాడు. దురదృష్ట వశాత్తు వాడు ఏకసంథాగ్రాహి. మంత్రోచ్చారణలోని లయ, పదాలను ఒడిసిపట్టుకొని వాడు మనసులోనే వల్లెవేసుకునే వాడు. రాజపురోహితుడి సమక్షంలో నోరుతెరిచే వాడు కాదు కాని, ఎక్కడైనా ఒంటరిగా బ్రాహ్మణ బాలుడు మంత్రోచ్చారణ చేస్తున్నప్పుడు తప్పులు దొర్లితే సరిదిద్దేవాడు. ఆ బాలల్లో అసహనం కట్టలు తెంచుకునేది. వాడి మీద రాజ పురో హితుడికి పితూరిలు వెళ్ళాయి. కాని అతను నమ్మలేక పోయాడు.

ఒకసారి రాజ పురోహితుడు పితృదేవతలకు పిండప్రధానం చేస్తుంటే

‘మా కడుపులు నింపడానికి చేతులు రావు కాని ఉన్నాయో లేవో తెలియని ఊర్ధ్వ లోకాలు… కంటికి కనపడని పితృదేవతలు… భోజ్య పదార్థాలని వృధా చేస్తున్నారు కదా’ అంటూ గొణిగాడంట. అది చిలవలు పలవలుగా రాజ పురోహితున్ని చేరింది. వాన్ని ఇతర సేవకులతో చావబాదించారు.

ప్రాణావిశిష్టంగా మారిన వాడికి భయం పోయింది. మనసుకు తోచిందే మాట్లాడసాగాడట.

“పరమాత్మ ప్రతి ఒక్కరిలో ఉంటుందంటావా! ఉండదు. దాసుల్లో ఉండాలంటే పరమాత్మకు కూడా అసహ్యం. సరే, ఉంటుందనుకుందాం. దాసుడి పరమాత్మ కంటే బ్రాహ్మణుడి పరమాత్మ గొప్పదై ఉంటుంది. బ్రాహ్మణ పరమాత్మ చెప్పినట్లు వినడమే దాస పరమాత్ముడి పని అయి ఉంటుంది” అంటూ వెక్కిరించేవాడట. వాడికి మతి భ్రమించిందనే ప్రచారమూ జరిగింది.

ఆ దాసుడు పురోహిత వర్గానికి కంట్లో నలుసుగా మారాడు. అంతలో రాజ పురోహితుడి మొదటి భార్య పెద్దకొడుకు వింత వ్యాధితో హఠాన్మరణం చెందాడు. బాపలకు ఒక సాకు దొరికింది. అధర్మం ప్రబలడం వల్లనే రాజ పురోహితుడి ఇంట్లో చావు సంభవించిందని ప్రచారం మొదలు పెట్టారు. దాసులు వేదోచ్చారణ చేస్తుంటే, సనాతన ఆచారాలను వెక్కిరిస్తు తిరుగుతుంటే అధర్మం ప్రబలదా అనే ప్రచారం ఊపందుకుంది. అది ఒక్కరి చావుతో ఆగదని, అందరి ముంగిళ్ళలోకి వస్తుందని అన్నారు. వారి లక్ష్యం స్పష్టంగా అందరికి అర్థమయింది.

విషయం న్యాయాధీశుడి వరకు వెళ్ళింది. అతడు ఆశ్చర్యపోయాడు. ఒక దాసుడి గురించి ఇంత హడావిడి అవసరామా? అక్కడే శిక్షిస్తే అడ్డుకునేవారెవరు? నిజాన్ని ఇతర పురోహితులు అతడికి చెప్పారు.

దాసబాలుడికి రాజ పురోహితుడి అండ ఉందని తెలిపారు. వాడు ప్రమాదకారే అయిన, చూస్తే మాత్రం అందంగా, అమాయకంగా ఉంటాడనీ వాడికి అన్నీ తల్లి పోలికలు వచ్చాయని అన్నారు. వాడి తల్లి రాజపురోహితుడి సంరక్షణలో ఉండి కొంత కాలం క్రితం మరణించిందని చెప్పారు.

న్యాయాధీశుడికి అంతా అర్థం అయింది. వాడి నాలుక కోసేయమని శిక్ష విధించాడు. అయితే వాడు పారిపోవడానికి రాజ పురోహితుడు సహకరించాడు. అయినా భటులు వాన్ని వదలలేదు. వెంటాడారు. చివరకు మా పల్లె తోటలోని ఇంటిలో పట్టుకున్నారు. నాలుక కోయడానికి ప్రయత్నించారు. పెనుగులాటలో వాడి ప్రాణాలే పోయాయి" పిప్పలుడి గొంతు జీరబోయింది.

అష్టకుడు నిశ్శబ్దంగా ఉన్నాడు. అతడి ముఖం నిండా విషాదం కమ్ముకొంది. ఏదో గుర్తుకు వచ్చిన వాడిలా హఠాత్తుగా అన్నాడు.

"ఆ దాసుడేమన్నాడు? ఉన్నావో లేవో తెలియని ఊర్ధ్వలోకాలన్నాడు?! ఎంత గొప్పగా కవితాత్మకంగా చెప్పాడు కదా! పరమాత్మ గురించిన పరమజ్ఞానం అతడికెలా వచ్చిందో!" ఆశ్చర్యపోతూ మాట్లాడాడు. చీకటి పడింది. పిప్పలుడి ముఖంలోని భావాలేవో తెలియడం లేదు.

***

## – 9 –

వైద్యశాలలో ఉండేటపుడు పిప్పలుడికి పాంచాల నగరి రాచ కుటుంబాల నుండి పిలుపులు వచ్చేవి. వైద్యశాలను మిత్రులిద్దరికి వదిలి వెళ్ళేవాడు. చాలా రోజుల తర్వాత తిరిగి వచ్చేవాడు. పాంచాల దేశమే కాదు అక్కడి నుండి ఇతరప్రాంతాలకు కూడా వైద్యసేవ నిమిత్తం, స్నేహితుల్ని కల్సుకోవడం కోసం వెళ్ళేవాడు. అతడు తిరిగి రాగానే అక్కడి విశేషాల్ని మిత్రులిద్దరు అడిగి మరీ చెప్పించుకునేవారు.

గతంలో పిప్పలుడు వైద్యశాలలో లేకపోతే అది బోసిపోయేది. కాని ఇప్పుడు కేవలుడు, అష్టకుడు చేతికంది రావడం వల్ల వైద్యశాలకు సాధారణజనాల రాకపోకలు యధావిధిగా జరుగుతున్నాయి. వైశ్యులు తము పండించిన ధాన్యంలో కొంతభాగాన్ని చికిత్సకోసం వచ్చినపుడు వైద్యశాలకు సమర్పించుకునే వారు. చేతివృత్తుల వారు తమకు తోచినదేదో ఇచ్చేవారు. లోచనుడి కృషి వల్ల పాలు, పెరుగుకు, మాంసానికి కొదవేలేదు.

ఎంతో శ్రమకోర్చి వైద్యం కోసం జనాలు ఇక్కడకు వచ్చేవారు. వాళ్ళను వదిలేసి ఒకరిద్దరు రాచకుటీంభీకులకు వైద్యం చేయడం కోసం

గాను పాంచాలకు పిప్పలుడు వెళ్ళడం అష్టకుడికి ఇష్టం ఉండేది కాదు. అదే విషయాన్ని అడిగాడు. అందుకు పిప్పలుడు

"అనుభవం మీద తెలుసుకుంటావు. నీకిష్టమైనవి పది పనులు చేయాలనుకుంటే నీ కయిష్టమైనవి ఒకటో, రెండో చేయాల్సి ఉంటుంది. కాదు, కూడదు అనుకుంటే నీ కిష్టమైన పని ఒక్కటి కూడ చేసే స్వేచ్ఛ నీకుండదు. నూరుగురుకి సహాయం చేయాలంటే ఒకరిద్దరి విషయాల లో రాజీపడక తప్పదు" అన్నాడు.

సంవత్సరాలు గడుస్తున్నాయి. లోచనుడు, పిప్పలుల శక్తిని వృద్ధాప్యం మందగింపచేస్తోంది. వివాహం చేసుకొమ్మని అష్టకున్ని ఎంతో బతిమిలాడేవాడు లోచనుడు. అష్టకుడు చిరునవ్వుతో విషయాన్ని దాటవేసేవాడు. కేవలుడికి దగ్గరి బంధువులమ్మాయితో వివాహం జరిపించారు. మిత్రులిద్దరు మంచి వైద్యులుగా చుట్టు పక్కల ప్రాంతాల్లో పేరు గాంచారు.

అష్టకుడి వివాహం చూడాలన్న కోరిక తీరకుండానే లోచనుడు మృతి చెందాడు. అష్టకుడిని శూన్యం ఆవరించింది. తన తండ్రిలేని లోటు అంతగా బాధిస్తుందని అతనేనాడు అనుకోలేదు. తననే అంటి పెట్టుకుని ఎల్లవేళలా తన అవసరాలు చూస్తూ తన గురించి మాత్రమే బతికిన తండ్రి లేకపోవడం తట్టుకోలేకపోయాడు.

"బతికున్న రోజుల్లో ఆయన్ని సరిగా అర్థం చేసుకోలేకపోయాను" అంటూ దుఃఖించేవాడు అష్టకుడు. కోలుకోవడానికి చాలా నెలలు పట్టింది. పిప్పలుడి కుటుంబం అతడికి అండగా ఉన్నారు.

ఈ సారి పిప్పలుడు బయటదేశాలకు వెళ్ళేటపుడు "మీలో నాతో రాగలిగే వారెవరు?" అని అడిగాడు ఇద్దరిని. మరోమాట లేకుండ

అష్టకుడు సంసిద్ధత తెలియచేసాడు.

నూతన ప్రదేశాలను చూడాలనే ఉత్సుకతే ప్రధానకారణం. కేవలుడు కూడా ఉత్సాహాన్ని చూపించాడు కాని ఇరువురు వెళితే తన కుటుంబానికి, వైద్యశాలకు ఇబ్బంది కలుగుతుందని ఆగిపోయాడు.

అష్టకుడిని తీసుకొని తగిన సరంజామాతో బయలుదేరాడు పిప్పలుడు. పాంచాలదేశంలోని ప్రతివీధిలో పిప్పలుడికి లభించే గౌరవ మర్యాదలు చూసి ఆశ్చర్యపోయాడు అష్టకుడు. దాసుల నుండి మొదలు పెడితే యజమానుల వరకు అందరు అతడిని గౌరవించేవారే. అతడి విడిదికి దాసులు వచ్చి తమ జబ్బుల గురించి చెప్పుకునేవారు. ఆ క్రమంలో పిప్పలుడితో వారి సంభాషణ కేవలం జబ్బులకే పరిమితం కాకుండా వారి కాయకష్టం, తిండితిప్పలు, ఇతర సమస్యల ప్రస్తావన వచ్చేది. అక్కడున్న రాచవైద్యుడితో పిప్పలుడికి మంచి వాత్సల్యపూరిత స్నేహం ఉంది.అష్టకున్ని తీసుకొని పిప్పలుడు ఆ రాచగృహాల్లోకి వెళ్ళాడు.

విశాలమైన వారి గృహాలు... రాళ్ళతోను, మట్టితోను, కర్రలతోను నిర్మించి యున్న రకరకాల కక్ష్యలు, దాసదాసీజనం చూసి ఆశ్చర్య పోయాడు. రాగిపాత్రలకు కొదవే లేదు. దాసుల్లో రకరకాల జాతుల వారుండడం గమనించాడు. కాయకష్టం ఎరగని రాచస్త్రీలు కోమలంగా ఉన్నారు. ఆ రోజంతా రాచవీధిలో తిరిగి తమ విడిదికి చేరుకున్నారు.

జరిగిన కొన్ని విషయాలు తలుచుకుంటే నవ్వు వచ్చింది అష్టకుడికి. చావుకి దగ్గరగా ఉన్న ముసలి రాచకుటుంబీకుడు పుంసత్వం కొరకు పదే పదే దీనంగా గురువుల వారిని ప్రాధేయపడ్డాడు. అందుకోసం గాను అప్పటి వరకు తాను చేసిన ప్రయత్నాల్ని వివరంగా చెప్పాడు. ఎలుగుబంటి పురీషభాగాన్ని సేవించాడట. రకరకాల పిచ్చుక లేహ్యాలు

సేవించడం చెప్తుంటే తను బలవంతంగా నవ్వు ఆపుకోవలసి వచ్చింది.

అష్టకుడు ఇలా తనలో తాను నవ్వుకుంటున్నపుడు విడిదిలోకి ఒక మధ్య వయస్కుడు వచ్చాడు. ఒంటి చుట్టూ పై వస్త్రంగా గొంగడి ధరించి తీక్షణమైన చూపులతో విలక్షణంగా ఉన్నాడతడు. అతడిని చూడగానే వెలిగిపోతున్న ముఖంతో పిప్పలుడు వెళ్ళి కౌగిలించుకున్నాడు. కుశల ప్రశ్నలయ్యాక, అష్టకుడిని పరిచయం చేసాడు. తన గురించి విని ఉన్నానని ఆ వ్యక్తి చెప్పడం అష్టకునికి సంతోషాన్ని కలిగించింది. వారి సంభాషణ అష్టకుడికి కొత్త లోకాల్ని పరిచయం చేసింది.

"పాంచాల దేశ పర్యటన ఎలా సాగుతున్నది?" అంటూ ప్రశ్నించాడు కేశవసనుడు.

"మాదేముంది కేశవసనా... ముక్కుతూ మూల్గుతూ వచ్చే వాళ్ళ ను కలుసుకోవడమే కదా మా పని. రోగాలు, ఏడుపులు మధ్య, మధ్య కాసింత కృతజ్ఞతలు. వైద్యుల జీవితం పరిమితమైందని నీకు తెలుసే కదా!" అన్నాడు నవ్వుతూ.

"మిత్రమా! నీ మాటలకేంగానీ సరాసరి నడిరాజ గృహంలోకి వెళ్ళి రాజు చేతి నాడిని, ఊరిబయట ఉన్న ఛండాలుడి చేతి నాడిని పరీక్షించేది నువ్వేగదా. కానుకలు దండుకుంటు ఆశీర్వచనాలిచ్చే బాపడి నాలుకను, నోట్లో నాలుకలేని శూద్రుడి నాలుకను పరీక్షించేది నువ్వే కదయ్యా" అన్నాడు కేశవసుడు. నవ్వుకున్నారందరు.

తిరిగి ఇలా అన్నాడు.

"పెద్దవాళ్ళందరివి తిన్నది అరుగని రోగాలు. అసలు ఈ బ్రాహ్మ ణుల, క్షత్రియుల గడపలు తొక్కకుండ వాళ్ళ జబ్బులను వాళ్ళు నమ్ముతున్న దేవుళ్ళకే వదిలేస్తే రోగం కుదిరిపోను..."

"ఆగాగు కేశవసనా నేనూ బాపడినే" అన్నాడు పిప్పలుడు.

"నువ్వు మానవుడివి" అన్నాడు కేశవసనుడు.

"నీతో వాదించలేను కాని ఒక విషయం మాత్రం చెప్పగలను. తిన్నదరగని రోగాలన్నావే. ఒక వైద్యుడిగా నా దృష్టిలో రోగం రోగమే. అజీర్తితో బాధపడే వాడి కడుపు నొప్పికి మాత్రమే కాదు, సరిపోయినంత తిండి లేకుండా బాధపడే వాడి శారీరక బలహీనతకీ మందులిస్తాను. శిరోవేదన పడేవాడి నెత్తిన కిరీటముందా, మాసిన తలపాగా ఉందా నా కనవసరం. ఆ నొప్పేమిటో దానికివ్వదగిన ఔషధమేమిటో అన్నదే ముఖ్యం నాకు" అన్నాడు పిప్పలుడు స్థిరమైన గొంతుతో.

కేశవసనుడు అదే చిరునవ్వుతో "నీవు మానవుడివి కాదు వైద్యుడివి" అన్నాడు.

"నీవు నిజమే చెప్పావు కేశసనా! నేను చాలా దేశాలు తిరిగాను. వివిధస్థాయి మనుషుల్ని కలుసుకున్నాను. రకరకాల సమాజాల్ని చూసాను. నేను గ్రహించిందేమిటంటే మానవుడిగా మనుగడ సాగించడం కష్టం. రాజుగా, సేవకుడిగా బతకొచ్చు. మానవ దృక్పథానికి చికిత్స చేయాలా? మనిషి శరీరానికి చికిత్స చేయాలా? అనే ప్రశ్న చాలాసార్లు ఎదురయ్యింది నాకు. నీకున్నంత ధైర్యం నాకు లేదు. అందుకే వైద్యుడిగా ఉండి పోయాను" అన్నాడు పిప్పలుడు నిరుత్సాహంగ ఉన్న గొంతుతో.

ఆ గదిలో నిశ్శబ్దం అలుముకుంది. దాన్ని భగ్నం చేస్తు కేశవసనుడు

"నీ అభిప్రాయమేమిటి అష్టకా" అని అడిగాడు అకస్మాత్తుగా.

మొదటి నుండి వాళ్ళ సంభాషణ అతనికి ఉద్వేగాన్ని కల్గిస్తున్నది.

సమాధానం చెప్పడానికి ఉత్సాహపడ్డాడు.

"నా అభిప్రాయం ఏమిటంటే అజీర్తితో బాధపడే వాడికి కొద్దిగా తక్కువ తినమని చెప్పవచ్చు. అలా మిగిల్చినదాన్ని ఆకలి గొన్నవాడికి ఇవ్వమని చెప్పవచ్చు, ఊరకే తేరగా తిని కూచో కుండ ఒంటికి కాస్త శ్రమ కల్పించమని సలహా ఇవ్వొచ్చు. శిరస్సు ఉన్నపుడు శిరోవేదన ఉంటుంది కానీ, కిరీటాల వల్ల శిరోవేదన ద్విగుణీకృతమవుతుందని చెప్పవచ్చు. కిరీటం వదలి తలపాగా ధరిస్తే నొప్పి సగం తగ్గుతుందని సలహా ఇవ్వవచ్చు" అన్నాడు అష్టకుడు.

కేశవసనుడు పగలబడి నవ్వాడు.

కళ్ళల్లో నీళ్ళు చిప్పిల్లాయి.

లేచి నించొని అష్టకుడి భుజాలు పైకెత్తి మరీ కౌగిలించుకున్నాడు.

"భేష్ అష్టకా నీ మధ్యే మార్గం భలే బావుంది" అన్నాడు.

అష్టకుడు నవ్వుతూనే పిప్పలుడి వైపు చూసాడు.

ఎందుకో అకస్మాత్తుగా పిప్పలుడి స్థానంలో దిగులుగా ఉండే తన తండ్రి కనిపించాడు అష్టకుడికి.

అప్పటి నుండి కేశవసనుడికి అష్టకుడికి మధ్య స్నేహం చిక్క బడింది. అష్టకుడిని వెతుక్కుంటూ చాలాసార్లు కేశవసనుడు వచ్చేవాడు. కేశవసనుడి సమక్షాన్ని అష్టకుడు కూడా బాగా ఇష్టపడేవాడు.

***

## - 10 -

అష్టకుడికి భ్రమణకాంక్ష ఎక్కువయింది. పాంచాలదేశమును దాటి బహిళక నుండి గిరివ్రజము, తక్షశిలలను దర్శించాడు. ప్రాగ్జోతిష్యనగరాన్ని దాటి మేరు పర్వత పాదాల వద్దకూడా సంచరించాడు. ఉత్తరదిక్కుగా మద్ర, కాంబోజ, యవన రాజ్యాలను చూసాడు. చీనా, పరమచీనా హిమాలయములను దర్శించాడు. వీటన్నింటిని ఒకే తూరి కాకుండా విడతలు విడతల వారీగా దర్శించుకున్నాడు. సంవత్సర కాలంలో సగభాగం వైద్యశాలలోను మిగతా రోజులు బయట తిరుగుతూ గడిపేవాడు. ఎక్కడికివెళ్ళినా అతడి ప్రయాణపు ఏర్పాట్లకు తిండికి ఏ లోటు ఉండేది కాదు. అన్ని ప్రాంతాల్లోను వైద్యవృత్తి అతన్ని ఆదుకుంటు వచ్చింది.

తన ప్రయాణాల్లో అనేక జాతులను, తెగలను కలుసుకున్నాడు. కిన్నెర, కింపురుష, గంధర్వ, పిశాచ, కిరాత భూముల్లో సంచరించి ప్రతిచోట ఒక్కరో ఇద్దరో స్నేహితులను సంపాదించుకున్నాడు. విభిన్న మైన ఆచార వ్యవహారాలు అతడి లౌకికదృష్టిని విశాలం చేసాయి. వివిధ ప్రాంతాల్లోని పూజా పద్ధతులను దేవతారూపాలను చూసిన

మీదట అప్పటి వరకు అతడి మనసులో అస్పష్టంగా ఉన్న తాత్త్విక భావన ఒక స్పష్టమైన రూపాన్ని తీసుకుంది.

ఈ ప్రయాణాలు అష్టకుడికే కాకుండా శరదండా నదీతీరంలోని వైద్యశాలకు అదనపు ప్రయోజనాలను సమకూర్చింది. విభిన్న ప్రాంతాలలో ఉపయోగిస్తున్న రోగనిర్ధారణ పద్ధతులను, ఔషధాలను క్షుణ్ణంగా అధ్యయనం చేసేవాడు. అందులో మెరుగైన వాటిని కేవలుడితో చర్చించేవాడు.

భౌతికాంశాల వల్ల వచ్చే రోగాలు మనుషుల అజ్ఞానం వల్ల ఏ విధంగా మూఢనమ్మకాలవైపు దారి తీస్తాయో చివరికి దైవభీతిని ఎంతగా పెంచుతాయో చూసాక వైద్యవృత్తి మీద అతనికి అంతులేని ఇష్టం కలిగింది. అదే క్రమంలో మనసా వాచా కర్మేణా వైద్య వృత్తికే అంకితమైన పిప్పలుడి పట్ల గౌరవం, కేవలుడి పట్ల అభిమానం రెట్టింపయ్యాయి అష్టకుడికి.

అష్టకుడు ప్రయాణిస్తున్నపుడు ఒక్కోసారి ఘర్షణ జరుగుతున్న ప్రాంతాల్లోకి తెలిసో తెలియకో వెళ్ళవలసి వచ్చేది. ఆటవిక తెగల మధ్య కొట్లాటలు, ఆటవిక తెగలకు ఇతరులకు జరిగే ఘర్షణల్లో ప్రత్యక్ష సాక్షిగా ఉన్నాడు. గాయపడ్డ వారికి చికిత్సలందించడానికి ప్రయత్నించేవాడు. కొట్లాట అనంతరం తీవ్రరక్తస్రావం అవుతున్న వారికి వైద్యం చేయాలంటే మీనమేషాలు లెక్కిస్తే కుదరదు. వేగంగా నిర్ణయాలు తీసుకోగలగాలి. అది అష్టకుడిని మరింత రాటుదేలేటట్టు చేసింది. తన చేతుల్లో యాతనపడుతూ మృతిచెందిన వాళ్ళూ ఉన్నారు. స్వస్థత పొందిన వాళ్ళూ ఉన్నారు.

ఎవరికి వైద్యం చేసినా అతడు పిప్పలుడిని గుర్తు చేసుకొనేవాడు.

పిప్పలుడి స్ఫూర్తితో, చూపిన దారిలో తనకు తోచిన విధంగా చేసేవాడు. మనసుకు అలసట కలిగినపుడు శరదండానదీతీరం ఉండనే ఉంది. అతడిని ఉల్లాస పరచడానికి కేవలుడు ఎప్పుడూ సిద్ధమే.

రోగాలు నయం చేయడం పేరిట ఆర్థికంగా లబ్ధి పొందేవారిలో వైద్యులకంటే పూజారివర్గమే ముందుంటుందని గ్రహించాడు. గ్రహశాంతులు, శాంతి పూజలు దయ్యాలు, దేవుళ్ళ పేరిట జరిగే తంతు కార్యక్రమాల్లో ఆటవిక తెగల నుండి మొదలుపెడితే పల్లెలు నగరాల వరకు పురోహిత వర్గమొకటి తయారై ప్రజల్ని పీక్కు తింటుండడం పట్ల వ్యధ చెందేవాడు. అందుకే ఎక్కడకు వెళ్ళినా అక్కడ ఎవడో ఒక ఉత్సా హవంతునికి కొంత వైద్యం నేర్పేవాడు. ఆయాప్రాంతా ల్లో విస్తారంగ దొరికే ఔషధ మొక్కలు ఏ యే రోగాలకు పనికొస్తాయో నేర్పేవాడు.

అతడు ఏ నగరంలోకి వెళ్ళినా అన్ని వర్గాల ఆదరణ లభించేది. ఆ క్రమంలోనే జాబాలితో పరిచయం కలిగింది. జాబాలి మేధా సంపన్నత అతని జ్ఞానతృష్ణను తీర్చింది. ఒక విషయంలో మాత్రం జాబాలితో తీవ్రంగా విభేదించేవాడు.

“పదార్థమే నిత్యమూ సత్యము అని నేనూ నమ్ముతాను. మరణానం తర జీవితమొకటి ఉంటుందని అనుకోవడం లేదు. కార్యకారణ సంబంధాన్ని ప్రశ్నించను. కాని గురువర్యా, కొన్ని ప్రాంతాలలో ఈ భావజాల ప్రతినిధులను గమనించాక ఈ మాట చెప్పసాహసిస్తున్నాను. పాపం, పుణ్యం అంటూ ప్రత్యేకించి ఉండవని, స్వర్గం నరకం లేవు కాబట్టి, మన ముందున్న కాలాన్ని ఒడిసిపట్టుకోవాలనే తపనతో సుఖలాలసవైపు, ఒక అరాచకత్వం వైపు వెళ్తున్నారు. అత్యున్నతమైన ఆలోచన విధానం ఆచరణలో పక్కదారి పడుతుందనిపిస్తుంది” అన్నాడు.

"నువు సూచించేదేమిటో స్పష్టంగా చెప్పు" అన్నాడు అక్కడే ఉన్న కేశవసనుడు.

"ఈ విషయంలో నాకు స్పష్టత లేదు. కానీ నేననుకునేదేమిటంటే కొన్ని నియమాలు ఏర్పడాలి" అన్నాడు అష్టకుడు.

"ఎలాంటి నియమాలు?" అడిగాడు కేశవసనుడు.

"శ్రమచేసి సంపాదించుకోవాలి. స్వర్గం లేదు కాబట్టి పుణ్యం చేయాల్సిన అవసరం లేదనుకుంటున్నారు. పుణ్యం అంటే తన తోటి వారికి సాయం చేయడమే అని నా భావన. తన సుఖం మాత్రమేతాను చూసుకోకుండ తనకున్నదాన్ని పక్కవాళ్ళతో పంచుకోవాలి. ఇతరుల సంపదలను దొంగిలించరాదు..."

అష్టకుడి మాటలు పూర్తి కాకుండానే కేశవసనుడు బిగ్గరగా నవ్వాడు. నవ్వుతూ

"ఈ చివర చెప్పిన నియమము ఉంది చూసావు... దాసుల్ని, సంపదను బాగా పోగేసుకున్న గొప్ప ధనికులకు మాత్రం భలేగ నచ్చుతుంది" అన్నాడు.

అతన్ని ఆగమన్నట్టు చూసాడు జాబాలి.

"నీవి అర్థవంతమైన ప్రతిపాదనలు అష్టకా. పదార్థమే ప్రాథమికమైనది. లోకాతీతశక్తులు అనేవి కల్పితాలని చెప్పడం వల్ల మూఢనమ్మకాలు తొలుగుతాయి. దేవుళ్ళ పేరిట జరిగే ఘోరాలు తొలగుతాయి. అసమానతలు తగ్గుతాయి. కాని నీవంటున్న అవలక్షణాలు కూడా లేకపోలేదు. అయితే సూటిగా ఒక ప్రశ్న అడుగుతాను. ఏ ఏ నియమాలు ఉండాలో ఎవరు చెప్తారు? నియమోల్లంఘన జరిగితే ఏం చేయాలి" అన్నాడు.

అష్టకుడేమి మాట్లాడలేదు. జాబాలి మళ్ళీ అన్నాడు.

"నియమాలు నూతన మత ఆవిర్భవానికి దారి తీస్తాయి. మతమంటే దేవుడు. అతడి ప్రతినిధులు. నియమోల్లంఘున జరక్కుండ ఉండడం కోసం దైవభీతి, పాపభీతి ... మళ్ళీ ఒక కొత్త మతం, కొత్తదేవుడు ఈ ప్రపంచానికవసరమా?" అంటూ ప్రశ్నించాడు.

అందుకు అష్టకుడు "పదార్థమే ప్రాథమికమైనదని ఊర్ధ్వలోకాలు, పునర్జన్మలు ఉండవని ప్రతిపాదించితే సరిపోతుందా. దాని పర్యవసనాలను సమాజం పురోభివృద్ధికి ఉపయోగించుకునే అవకాశమే లేదా" అని అడిగాడు.

అందుకు జాబాలి "పునర్జన్మ లేదని ఈ జన్మే సత్యమని చెప్పినంత మాత్రాన మనుషులు పరాన్నజీవులు అవుతారనుకుంటే అది తప్పే అవుతుంది. మన ఆలోచన ధోరణిని విశ్వసించే వారిలో ఎంతోమంది పరోపకారుల్ని చూసాను. మానవ కనీస కర్తవ్యాల నుండి విముఖులు కాకుండ పక్కవాడి కోసం ప్రాణాలర్పించిన వాళ్ళను చూసాను. ఒకడు పరాన్న జీవిగా ఉన్నా డంటే అది వాడి లోపం మాత్రమే కాదు మనలోపము కూడా. అత్యున్నత మైన ఈ తత్వాన్ని మరింత విస్తృతంగా, సమర్థవంతంగా తీసుకపోవడ మొక్కటే మార్గం. ఏమో నువు చెప్తున్న తరహాలో నూతన మతం ఆవిర్భవిస్తుందేమో..." అన్నాడు.

జాబాలి సమక్షంలో చర్చోపచర్చలు జరిగేవి. రకరకాల ప్రాంతాల నుండి వచ్చిన వ్యక్తులు కొత్త కొత్త విషయాలెన్నింటినో తెలియపరచేవారు. జాబాలి, కేశవసనుల సాంగత్యంతో అష్టకుడి దృక్పథంలో పూర్తి స్పష్టత వచ్చింది.

కాలం గడుస్తున్నది. పిప్పలుడు మరింత వృద్ధుడైనాడు. అష్టకుడిలో

సైతం వయసు మీరుతున్న లక్షణాలు కనపడసాగాయి. అతడు జాబాలి వద్దకు తరచూ వస్తు పోతుండేవాడు. ఆ ప్రయాణాల్లో అపరతాల పర్వత పాదం వద్ద ఉండే వైద్యుడు నిష్కముడు అష్టకుడికి ఆప్తుడయ్యాడు. అతడి కూతురు కాణవి అష్టకుడితో చాలా సన్నిహితంగ ఉండేది. ఆమె సమక్షంలో అష్టకుడు సేదతీరేవాడు. కాణవిది మంచి గాత్రం. అశువుగా పాటలు అల్లగలదు. అష్టకుడిని అక్కడే కట్టిపడేయాలని చూసింది కాని విఫలమయింది. స్వేచ్ఛా విహంగం లాంటి అష్టకుడు ఏ బంధాలకు బందీ కాదలుచుకోలేదు. ఎన్ని ప్రాంతాలు తిరిగానా శరదండా నదీ తీరానికి వచ్చేసరికి కాణవి దగ్గరకు వెళ్ళాలనే తపన కలిగేది. కాణవి దగ్గరికి వెళ్ళాక కొద్ది రోజులుంటే చాలు మళ్ళీ కాలు నిలిచేది కాదు.

"నీవు కాళ్ళకు చక్రాలతో పుట్టావు" అనేది కాణవి. కేవలుడు చాలాసార్లు పరాచిక మాడేవాడు.

"మానవా, కాణవి దగ్గర కెళ్ళడం మానవా" అనేవాడు.

కాణవి కూడా అష్టకుడు వచ్చేవరకు కొత్త పాటలతో సిద్ధంగా ఉండేది.

వృద్ధాప్యంలో కూడా పిప్పలుడు వైద్యం చేయడం కోసం, ఔషధ మొక్కల కోసం పలుప్రాంతాలు తిరగేవాడు. మితిమీరిన శ్రమ అతడి ఆరోగ్యంపై ప్రభావాన్ని చూపెట్టింది. పిప్పలుడు మరణించినపుడు తన తండ్రి మరణించినప్పటి కంటే ఎక్కువ దుఃఖపడ్డాడు. కేవలుడి దుఃఖమైతే చెప్పవశంకాదు. ఆ సంవత్సరము ఎటు కదలకుండా అక్కడే ఉన్నాడు అష్టకుడు.

***

# - 11 -

ఈసారి వర్షాకాలం ముగిసినా అష్టకుడు శరదండా నదీతీరం వదలలేదు. ఎటు చూసినా పచ్చదనం, శరదండా నది గలగలలు మనసుకు ఆహ్లాదం కలిగిస్తున్నాయి. వైద్యశాల ప్రధాన శిబిరం నుండి బయటకు వచ్చి కాస్త ఎడంగా ఉన్న తన పర్ణశాలవైపు నడిచాడు. అతని సహాయకులు పనుల్లో నిమగ్నమై ఉన్నారు. సూర్యుడు నడినెత్తిమీదకు వచ్చేవరకు ఔషదాల్ని పరిశీలిస్తూ వారికి సూచనలిస్తూ గడిపాడు. కడుపులో ఆకలి దహించడం మొదలు పెట్టాక కేవలుడి కుటీరం వైపు నడిచాడు. లోపలికి వెళ్ళేసరికి కేవలుడు అతడి పిల్లలు ఎదురుచూస్తూ ఉన్నారు.

కేవలుడి భార్య అందరికి రాగిపళ్ళాలు పెట్టి భోజనం వడ్డించింది. మొదట అపుపాలను వడ్డించింది. చిక్కటి పాల కమ్మదనం యవపిండి తాజాదనాన్ని ఆస్వాదిస్తు తిన్నారు. కాల్చిన చిక్కుడు గింజలను, నేతిలో వేయించిన మాంసాన్ని, తేనెలో నానబెట్టిన ఎండిన పళ్ళను తృప్తిగా తిన్నారు.

“ఏమిటమ్మ ఈ రోజు విశేషం… ఇన్ని పదార్థాలు వడ్డించారు” అన్నాడు అష్టకుడు చేతులు కడుక్కొని మూతితుడుచుకుంటు.

“పక్క పల్లియలో ఏదో ఉత్సవం జరుగుతుందట. దాని తాలుకు

భోజన సరంజామ మనకు పంపించారు” అన్నాడు కేవలుడు.

కొంతసేపు అది ఇది మాట్లాడాక అష్టకుడు తన కుటీరానికి వెళ్ళి విశ్రాంతి తీసుకున్నాడు.

మరుసటి రోజు అష్టకుడు పాంచాల దేశం బయలుదేరాడు. వైద్యశాలకు కావలసిన వస్తుసామాగ్రి గురించి మళ్ళీ గుర్తుచేసాడు కేవలుడు.

అష్టకుడు తన ప్రియసహాయకుడు శంకుని తీసుకుని గుఱ్ఱాలపై బయలు దేరాడు. వారిద్దరు పాంచాల దేశం చేరుకున్నారు.

నగరం బయట కాసేపు విశ్రాంతి తీసుకున్నారు. ఇంకా ఎండగానే ఉంది. చెమటను పై నూలు వస్త్రంతో తుడుచుకుంటూ గుఱ్ఱం దిగి నడవసాగారు. మొదట పని, తర్వాతే మిత్రులు అనుకున్నాడు అష్టకుడు. కమ్మరుల వీధుల్లోకి నడిచాడు. రోజు రోజుకు కమ్మరశాలలు పెరుగుతున్నాయి. కొత్త వృత్తికారులు, కొత్త పనివారు కనిపించారు. ఒక సంవత్సర కాలంలోనే ఎంత మార్పువచ్చింది అనుకున్నాడు అష్టకుడు. నేరుగా చగనుని కమ్మరశాలకు వెళ్ళాడు. గతంలో పోల్చలేనంతగా మారి ఉంది ఆ ప్రదేశం.

ఖాళీగా ఉండే ప్రాంతమంతా ఆవంలతో నిండి ఉంది. చిట్టెంల ముద్దలకు ఇనుపరజను కుప్పలకు లెక్కలేదు. కొలుములు ఎక్కువయ్యాయి. పెరిగిన పనివాళ్ళతో గిజగిజలాడుతోంది చగనుడి కమ్మరశాల. దూరం వరకు కూడా సెగ వేడిగా ఒంటికి తగులుతున్నది. చగనుడు తన ఇంట్లో విశ్రాంతి తీసుకుంటున్నాడు.

అష్టకుడిని చూడగానే చగనుడికి సంతోషం కలిగింది. అతని భార్య జబ్బుతో ఉంది. అష్టకుడి ఔషదాలంటే ఆ కుటుంబానికి గురి

ఎక్కువ. అతడిని ఆహ్వానించి చెక్క ఆసనంపై కూర్చోబెట్టి కుశలప్రశ్నలు వేశారు. తాగడానికి సుగంధ ద్రవ్యాలు కలిపిన చిక్కటి పాలను ఇచ్చాడు. తన భార్య అనారోగ్యం గురించి విన్నవించుకున్నాడు. అష్టకుడు ఆమెను పరీక్షించాడు. ఆ స్త్రీ ముఖం, శరీరం తెల్లగా పాలిపోయి ఉంది. మధ్య మధ్యలో స్పృహ కోల్పోతూఉంది. నోటి వెంట సన్నటి గురక లాంటి శబ్దం వస్తున్నది. ఆమెను కొద్ది రోజులు కమ్మరిశాలకు దూరంగా ఉంచమన్నాడు. తన వద్ద ఉన్న సంచిలో నుంచి చూర్ణాన్ని తీసి ఇచ్చాడు. అది సేవించవలసిన విధానం చెప్పాడు. మరుసటి రోజు వచ్చి కొన్ని గుళికలను కషాయాన్ని తీసుకోమన్నాడు. అనంతరం ఇద్దరు కమ్మరి శాలలోకి నడిచారు.

పూర్తిగా శుద్ధి చేయని ఇనుపచిట్టెంముద్దలు కుప్పలు కుప్పలుగా పడి ఉన్నాయి. చిన్న చిన్న ఆవంల వద్ద అనార్యసంతతి వాళ్ళు పొగచూరిన, మసికమ్మిన దేహాలతో మరింత నల్లగా కనిపిస్తున్నారు. కృశించిన వారి శరీరాలు వింత జీవుల్ని తలపిస్తున్నాయి.

"ఏమిటిది మిత్రమా, ఈ పనివాళ్ళకింత విశ్రాంతి, కొంత మంచి ఆహారం ఇవ్వరాదా? వీళ్ళ పరిస్థితి మరీ దయనీయంగా ఉంది..." అన్నాడు.

చగనుడు పెద్దపెట్టున నవ్వాడు.

"ఈ దాసులకా? మన ఆర్యయోధులు ఇంద్రుని కోసం ప్రాణాలర్పిస్తారు. ఈ దాసులు మన సేవకోసం అంకితమవుతారు. అదేకదా జీవిత పరమార్థమని వినలేదా అష్టకా? 'దాసుడా... దాసుడా నీవెక్కడుంటావ్ అని వెనకటికెవడో అడిగితే నీ నట్టింట్లో ఉంటాను, నీ నెత్తిపై ఉంటాను అన్నాట్ట" అంటూ మళ్ళీ ఫెళ్ళున నవ్వాడు.

తిరిగి చగనుడే అన్నాడు.

"వీళ్ళుపోతే ఇంతకు రెట్టింపు మందిని పంపిస్తామన్నారు అయోధ్య లోని వర్తకశ్రేణులు. మన తూర్పు అరణ్యాల్లో ఇట్లాంటివారు వేనకు వేలు. చేతినిండా పని, చేతికింద కావల్సినంత మంది దాసులు ఉండా లంటే కావల్సిందల్లా రాజు సంకల్పబలం. ఇప్పటి రాజుల్ని చూస్తున్నావు కదా. కాళ్ళు కదల్చరు కాని కీర్తి మాత్రం కావాలి! ఇపుడు ఎవరిమాటకేం విలువ ఉందిలే. సభలో ఒకప్పుడు మా ముత్తాతలు గణంలో ముఖ్యులుగా ఉండేవారు. గణం యావత్తు వాళ్ళపట్ల గౌరవంతో ఉండేవాళ్ళు. ఇపుడన్నీ పోయాయి" అంటూ నిట్టూర్చాడు.

తోలు తిత్తుల గుండా వస్తున్న గాలి చప్పుడు, నెగడు చేసే విచిత్ర శబ్దాలను వింటూ ఉన్నాడు అష్టకుడు. చెమటను తుడుచుకుంటూ కలియ తిరిగాడు. చివరకు కాస్త దూరంగా గాలి బాగా ఆడే ప్రదేశంలో చెక్క ఆసనాలపై కూర్చున్నారు.

వాళ్ళముందు కొన్ని చిన్న కత్తులు, సూదులు, సుత్తి, అంపం వంటి పరికరాల్ని తీసుకువచ్చారు దాసులు. అష్టకుడు జాగ్రత్తగా గమనిస్తూ కొన్నింటిని ఎంపిక చేసుకున్నాడు. వాటిని మూటగా కట్టి తన సహాయ కుడు శంకుకు ఇచ్చాడు.

అష్టకుడు చగనుడి ముఖంలోకి చూస్తూ

"మిత్రమా, తీరక లేకుండా ఉంది నీ పని. అలసట నీ ముఖంలో స్పష్టంగా కనిపిస్తోంది" అన్నాడు.

"అవును నిజమే, ఈ మధ్య పని ఒత్తిడి మరీ పెరిగిపోయింది. గత వారమయితే అలవాటులేని కొత్త పనిలో పడిపోయాము. పడమటి ప్రాంతాల నుండి యోధులు వచ్చారు. వాళ్ళ అస్త్ర శస్త్ర జ్ఞానం అమోఘం. పాత వాటిని మరమ్మత్తు వాళ్ళే చేసుకున్నారు. వాళ్ళకి పూర్తి స్థాయిలో

సహకరించమని పై వాళ్ళ ఆదేశం! నీకు తెలుసు కదా మా కమ్మరశాల ప్రఖ్యాతి. అయితే ఆ అస్త్రాల గురించి విని ఉండడమే తప్ప గతంలో ఎప్పుడు చూడలేదు. వాటి గురించి అడిగితే ఒక్కడూ నోరు విప్పడు. విచిత్రాకృతుల ఆయుధాలు సానబెట్టడం, ఆయుధ ప్రయోగ యంత్రాలు మరమ్మత్తు చేయడంలోనే కాలమంతా గడిచిపోయింది. పైగా వాళ్ళ భోజన వసతి సౌకర్యాలు నేనే చూసుకున్నాను. నా పని కూడా దాసుడి లాగే అయ్యింది పోయినవారం" అన్నాడు చగనుడుదీర్ఘంగా నిట్టూరుస్తు.

"మరి ఏమన్నా గిట్టుబాటు అయిందా లేదా" అడిగాడు అష్టకుడు.

"విశ్వామిత్రుడి దగ్గరి నుండి ఆశించడమే... అతను మమ్మల్ని సహాయం కోరడమే మహా ప్రసాదం" అన్నాడు చగనుడు.

"విశ్వామిత్రుడా?! ఆయన ఆయుధ సంపత్తికి, నైపుణ్యానికి ఆర్యవర్తనంలో సాటి రాగల వారెవరు" అన్నాడు అష్టకుడు.

"నిజమే అందులోను ఆర్యవర్త విస్తరణకు ఆయుధాలు ముఖ్యం. విశ్వామిత్రుడంతటి వారికి సేవచేయడం నా అదృష్టం" అన్నాడు ఉత్సాహంగ.

ఏదో గుర్తొచ్చినట్టు ఆలోచించుకుంటు తనలోతానే మాట్లాడు కుంటున్నట్లుగా చగనుడు,

"మొత్తానికి ఏదో జరగబోతుంది. ఇన్నాళ్ళకు దశరథుడైనా మేల్కొని సమస్త అరణ్యాల్ని కొల్లగొట్టి కొత్తపుడమి గర్భంలోకి నాగళ్ళను జొనుపు తాడేమో చూడాలి..." అన్నాడు ఉద్వేగంగా.

"మిత్రమా ఇపుడు ఉన్న బలవంతులైన రాజులలో దశరథుడు ఒకడని తెలుసు. కాని ఇపుడతని ప్రస్తావన ఎందుకు" అడిగాడు అష్టకుడు ఆసక్తిగా.

"ఒక లోహకారుడిగా నా అనుభవము చెప్తాను. నేను విన్నదాని ప్రకారం తూర్పు అరణ్యాలలోని కొన్ని ప్రాంతాల్లోని కొండల్ని గోళ్ళతో గీకితే ఇనుపరజను వస్తదంటారు. తామ్రానికి కొదవలేదంటారు. ముడి పదార్థం దొరక్క మాకు నానాయాతన అవుతుంది. అంత ఇనుము నా శాలలోకి రావాలే కాని నా ఇల్లు బంగారంతో నిండిపోదు" అన్నాడు నవ్వుతూ.

"అయినా అది అసాధ్యమైనపనేమో కదా" చగనుడి ముఖంలోకి గుచ్చి గుచ్చి చూస్తూ అడిగాడు అష్టకుడు.

"అసాధ్యమైనదే... నాకైతే ఏమి అర్థం కాలేదు. ఎందుకంటే వచ్చిన వాళ్ళలో ఒక్కడూ నోరు విప్పడే! కాని రహస్యంగా ఉంచడానికి వాళ్ళెంత ప్రయత్నించినా ఒకటి రెండు మాటలు నా చెవినపడ్డాయి. నాకు తెలిసిన దాని ప్రకారం విశ్వామిత్రుడు అయోధ్య పరిసరాలలో ఉన్నాడు. సిద్ధాశ్రమం ప్రస్తావన అస్పష్టంగా వినిపించింది. నేను విన్నది సిద్ధాశ్రమమా? మరేదైననా?..." అంటూ ఆలోచనలో పడ్డాడు. సిద్ధాశ్రమ ప్రస్తావన రాగానే ఉలిక్కిపడ్డాడు అష్టకుడు. అతని మనసు ఎందుకో కీడును శంకించింది.

ఇంతలో ఒక సేవకుడు వచ్చి భోజనాలు సిద్ధమయ్యాయని చెప్పాడు.

"లే మిత్రమా భోజనం చేద్దాం" అన్నాడు చగనుడు. కాని అష్టకుడు కదలలేదు. అతని మనసు ఏదో ఆందోళనతో ఉంది. సేవకుడు అక్కడి నుండి వెళ్ళిపోయాడు.

"మిత్రుడా! నీవేమో ఇనుపరజను కోసం ఆశ పడుతున్నావు. ఒకరేమో భూముల కోసం,కొందరేమో దాసులకోసం. వీటి పర్యవసనాలు

తెలుసా? అది ఎన్ని అరణ్యాల్ని శోకింపచేస్తుంది? ఎంతమంది పోగుల కింద నరకబడతారు? దాసుడిగా ఉండడం మీ కిష్టముండదే, మరి మనలాంటి సాటివాళ్ళను దాసులుగా చేయమని ఏ దేవుడు చెప్పాడు? చెప్పిన వాడు నిర్దయుడు తప్ప దేవుడు కాడు" అన్నాడు అష్టకుడు కోపం, వేదన నిండిన గొంతుతో. అతనెందుకో తన భావవేశాన్ని అణుచుకోలేకపోయాడు.

కొలిమిలో కాల్చిన ఇనుపముక్కలా ఎర్రబడింది చగనుడి ముఖం.

"అష్టకా! ఆపు నీ చార్వాక వాదన. నీవు గొప్ప వైద్యుడవు కాబట్టి, నీవొక అవసరం కాబట్టి, నీకు ముఖ్యులతో మంచి పరిచయాలు న్నాయి కాబట్టి నీలాంటి చార్వాకుల్ని సహిస్తుందీ ఆర్యవర్తం. ఆర్యద్రోహి గా మిగిలే మాటలు నా దగ్గర మాత్రం మాట్లాడకు" అన్నాడు కోపంగా. తిరిగి కొనసాగిస్తూ.

"నీవనేదేమిటి అందరూ చేతులు ముడుచుకొని కూచోవాలి. ఆర్యవర్తం ఆకలితో చావాలి. నూతన భూముల్లోకి వెళ్ళడం అదొక అవసరం, అనివార్యమని ఎందుకు మీలాంటి వాళ్ళకు తట్టదో" అన్నాడు.

దిగ్గున లేచాడు అష్టకుడు. తమాయించుకున్న చగనుడు అను నయించే గొంతుతో

"నే నా కమ్మరిశాల దాటి కాలు కదపను. నా కెందుకొచ్చినదీ గొడవలు. ఏది ఎలా జరగాలో అలా జరుగుతుంది. నీవు, నేను చేయగలి గిందేమి లేదు. మన మధ్య మాటల యుద్ధమెందుకు? పద వెళదాం భోజనానికి" అన్నాడు కొంత పశ్చాత్తాపం, వాత్సల్యం ధ్వనిస్తుండగా.

"నాకు ఆకలిగా లేదు. నేను వెళుతున్నాను" అంటూ రెండడు గులు వేసాడు. మళ్ళీ వెనక్కితిరిగి.

"ఈ రోజు ఎంత ఆలస్యమైనా ఔషధాలు సిద్ధం చేస్తాను. వచ్చి

తీసుకవెళ్ళడం మర్చిపోకు. నేను విడిది చేసిన బస తెలుసేకదా నీకు" అంటూ వెళ్ళిపోయాడు అష్టకుడు.

* * *

అష్టకుడు చాలాసేపు ఊరికనే నగరపరిసరాల్లో అలా తిరుగుతూ ఉండిపోయాడు. అతడలా అన్యమనస్కంగా ఉండడం చూసిన శంకు విషయం ఏమిటని అడిగాడు. ఏమి మాట్లాడలేదు అష్టకుడు. మనసు నొచ్చుకున్న శంకు.

"అలా అడిగే సాహసం చేసినందుకు మన్నించండి" అన్నాడు.

అష్టకుడు అతని వైపు తేరిపార చూసాడు, వెళ్ళి కౌగిలించుకున్నాడు. కౌగిలి వదలకుండానే "ఎల్లవేళలా నాకు దగ్గరగా ఉండే నువ్వు... అసలు నా గురించి నీకు తెలిసినంతగా ఎవరికి తెలుసు? నేను వైద్యుడిని, చికిత్స చేస్తున్నపుడు నాకు సహాయం చేస్తావు. అంతే కాని నేను నీ యజమానిని కాదు శంకు. నీవు నా మిత్రుడివి" అన్నాడు అష్టకుడు.

ఆ మాటలు విని బొట బొట కన్నీరు కార్చాడు శంకు. భుజం మీది వెచ్చటి కన్నీళ్ళ స్పర్శ అష్టకుడికి తెలుస్తునే ఉంది. అతని కళ్ళూ చెమర్చాయి. కొంత తేలికపడ్డ మనసుతో ఇద్దరు సమీపంలో ఉన్న రాళ్ళమీద కూర్చున్నారు. జరిగిందంతా అష్టకుడు చెప్పాడు. సిద్ధాశ్రమం గురించి తన అనుమానాల్ని చెప్పాడు. తనను బాధిస్తున్న విషయాల్ని పంచుకున్నాడు. అన్నింటిని సావధానంగా విన్నాడు శంకు. చిరునవ్వు నవ్వాడతడు. అతడి నవ్వు చూసి

"నా బాధ నీకు అర్థం అయినట్లులేదు" అన్నాడు అష్టకుడు.

అందుకు శంకు "అదికాదు నా ఉద్దేశం. వైద్యశాలలో నేను చేరిన కొత్తలో జరిగిన ఒక సంఘటన గుర్తుకువచ్చింది. నాతో పాటు

కూర్మడు చేరాడు.  వాడిది భలే సున్నితమైన మనస్తత్వం. పైగా పిరికి తనం.  ఆ రోజు మీరెవరు లేరు. మనదగ్గర పనిచేస్తున్న ఒకతని చేతిమీద రాయి పడి చితికిపోయింది.  వాడి సమీపంలోనే కూర్మడు న్నాడు. నొప్పితో వాడేమో ఏడుస్తున్నాడు. వాడి ఏడుపు, గాయం చూసి కూర్మడూ ఏడవడం మొదలుపెట్టాడు. దూరం నుండి చూస్తున్న నేను వాళ్ళ దగ్గరికి పరిగెత్తాను.  నేను వెళ్ళేటప్పటికే వాడు ఏడుపు ఆపి కూర్మడి మీద కేకలేస్తున్నాడు.

"నేను ఏడ్చి, నువ్వు ఏడ్చి ఏమిరా లాభం? ఏదో ఒకటి చేయరా? నువ్వా ఏడిస్తే మాత్రం నా నొప్పి తగ్గుతుందా?" అంటూ విల విలలాడాడు. మాకు తోచినట్టు ఏదో కట్టుకట్టాము. మీరు వచ్చాక వైద్యం చేసారు.  ఆ సంఘటన తలచుకుంటు ఇప్పటికీ కూర్మడిని ఆటపట్టిస్తాను.  కాని ఆ రోజే నిర్ణయించుకున్నాను. 'ఊరికే ఏడుస్తూ కూచో కూడదు.  ఏదో ఒక పని చేయాలి అని' అన్నాడు శంకు.

కొంత విరామం తర్వాత తిరిగి కొనసాగిస్తూ.

"నా మాటల్ని తప్పుగా భావించవద్దు.  ఊరికే ఆలోచిస్తూ మదన పడుతూ ఉంటే ఎవరికి ఒరిగేదేమి ఉండదు.  మనల్ని బాధిస్తున్న దాని గురించి ఏదో ఒకటి చేస్తూ ఉంటే మాత్రమే ఉపశమనం కలుగు తుంది" అన్నాడు శంకు.

ఆ మానసిక స్థితిలో అష్టకుడికి శంకు మాటలు గొప్ప స్వాంతన కల్గించాయి. కొత్త అర్థాలేవో స్ఫురించాయి. తన కర్తవ్యమేదో బోధపడు తున్నట్లుగా అనిపించింది. చాలాసేపు కూర్చుండి పోయాడు. మనసు తేలిక పడింది. ఇద్దరు కలిసి విడిదివైపు వెళ్ళారు. పనులన్నీ పూర్తి చేసుకున్నారు.  ఆ రోజు గాఢనిద్ర పట్టింది అష్టకుడికి

## - 12 -

అష్టకుడు, శంకు తిరుగు ప్రయాణమై వైద్యశాలకు చేరుకునే సరికి చీకటిపడింది. స్నానం ముగించుకొని తన కుటీరంలో విశ్రాంతి తీసుకుంటుండగా కేవలుడు నవ్వుముఖంతో ప్రవేశించాడు.

"ఏమి విశేషాలు సంచారి?" అని అడిగాడు హాస్యంగా.

"నీవిక్కడ పాతుకపోయి సమస్త భూభారమంతా మోస్తుంటే వేరే విశేషాలు ఏముంటాయి! అంతా సవ్యంగా, యథాలాపంగ జరుగుతూనే ఉంటుంది" అన్నాడు అష్టకుడు నవ్వుతూ.

"నా సంగతి వదిలెయి మిత్రమా... నువ్వు సంచార వైద్యశాలగా ఉండబట్టే కదా గోచర, రాక్షస భూములు ఆరోగ్యంగా ఉన్నాయి" అన్నాడు కేవలుడు మాటకు మాట బదులిస్తూ పక్కనే కూర్చున్నాడు.

అష్టకుడి ముఖం ముడుచుకుపోయింది. వయసు మీద పడుతున్న ఛాయలు దీపం వెలుతురులో కూడా స్పష్టంగ కనిపిస్తున్నాయి.

నిరుత్సాహ గొంతుతో అష్టకుడు "ఇంకెక్కడి రాక్షసభూములు మొన్నీ మద్యనే ఒక ఆర్యముని నూతన స్తోత్రం విన్నాను. భవిష్యద్దర్శనం

గురించి అతడు చెప్పినదేమిటి? 'అనతి కాలంలోనే రాక్షసభూములు అరక్షణగా మారతాయి. శత్రువుల అరణ్యాలు తగలబడతాయి. పచ్చిక బీళ్ళుగా మారతాయి. వాళ్ళకు నీడనిస్తున్న వృక్షాలు మన ఆవాసాల దూలాలుగా మారతాయి. వాళ్ళ నేలలు పెళ్ళగించి మన గాదెలు నింపుకుంటాం. వాళ్ళ తలల్ని మరింత నేర్పుగా, వేగంగా పదునుతో ఖండిస్తాం. బతికున్న వాళ్ళని మన పశువుల మందల్లో కలిపేస్తాం" అదేకదా వారి భవిష్యత్ జోస్యం. నిజమవుతుందేమోనన్న భయం కలుగుతుంది" అన్నాడు గోడకేసి జేరగిలబడుతూ.

కొంతసేపు నిశ్శబ్దంగా ఉన్నారిద్దరు.

"ఎందుకు మిత్రమా నీకింత ఆర్తి?" అడిగాడు కేవలుడు అతని భుజం మీద చేతి వేస్తూ.

"కేవలా! నీకు తెలుసు చాలా ప్రాంతాలు గురువుల వారితో తిరిగాను. వారు చూపిన తోవ ఇప్పటికీ నన్ను నడిపిస్తున్నది. జబ్బు పడ్డ ఆర్యుల్ని, ఆర్యేతరుల్ని, బ్రాహ్మణుల్ని, యక్షుల్ని, నాగుల్ని, కిన్నెర కింపురుష గంధర్వ పిశాచ కిరాతుల్ని, శ్వేత, గౌర, పింగళ, కృష్ణ వర్ణం వాళ్ళని ... ఎంతో మందిని ముట్టుకున్నాను. శరీరాలన్ని ఒకే రకమే కదా అనే జ్ఞానం వచ్చింది. రాతి గద దెబ్బతో పిండిగా మారిన ఆర్యుడి దేహంలోని ప్రాణం, లోహఖడ్గంతో చీలిన శరీరంలోని ఆర్యేతరుడి ప్రాణం అభేదమే కదా! మిత్రుడా, నీవు జబ్బుపడ్డ ప్రాణాలు కాపాడడానికి ప్రయత్నిస్తున్నావు. వైద్యుడిగా నా అనుభవము సగభాగం రణక్షేత్రంలోనే గడిచింది. నాకు పోయే ప్రాణాలే తప్ప ఆత్మలు ఎక్కడా కనిపించలేదు. మనం వైద్యులం. అందుకే మనం మానవులందరి పట్ల అభేద భావంతో ఉంటాము" అన్నాడు అష్టకుడు ఉద్వేగంగా.

మళ్ళీ నిశ్శబ్దం తాండవించింది వాళ్ళ మధ్య. కాస్సేపటి తర్వాత కేవలుడు

"మిత్రమా నీకొక శుభవార్త చెపుదామని కాచుక్కూచుంటే నీవేమో మరెటో లాక్కుపోయావు" అన్నాడు కేవలుడు.

ఏమిటన్నట్టు చూసాడు అష్టకుడు.

"అపరాతల పర్వతం నిన్ను పిలుస్తోంది" అన్నాడు కొంటెగా నవ్వుతూ.

"అర్థం కాలేదు" అన్నాడు అష్టకుడు. దాచుకున్నా అతని ముఖంలో చిరునవ్వు కనిపిస్తున్నది.

"నిన్ను రమ్మని కాణవి నుండి సందేశం. ఏదో కొత్తపాట నేర్చుకున్నట్లుంది" నవ్వుతూ అన్నాడు కేవలుడు.

ఇన్ని సంవత్సరాల కాలంలో కాణవి ఎప్పుడూ వర్తమానం పంపలేదు. ఇది మొదటిసారి అనుకున్నాడు అష్టకుడు.

కేవలుడు లేచి నిలబడుతూ "రేపు విశ్రాంతి తీసుకో. ఎల్లుండి ప్రయణమవుదువు గానీ. ప్రయాణానికి ఇప్పటికే అన్ని ఏర్పాట్లు చేసాను" అన్నాడు.

అష్టకుడు వీడ్కోలు తీసుకుని మరుసటిరోజే బయలు దేరాడు. అతడి వెంట శంకు కూడా బయలుదేరాడు. అయితే వాళ్ళ ప్రయాణం కేవలుడు భావిస్తున్నట్లు అపరాతల పర్వత పాదం వద్ద విశ్రమించడానికి కాదు. నేరుగా అయోధ్యకు వెళ్ళి అక్కడ జాబాలి వారిని దర్శించుకొని సిద్ధాశ్రమానికి వెళ్ళాలనేది అష్టకుడి ఆలోచన. 'సిద్ధాశ్రమమే నా అసలైన కార్యక్షేత్రం' అనుకున్నాడు. అష్టకుడు. అదే విషయాన్ని శంకుతో చెప్పినపుడు,

"నేనూ మీ వెంటే ఉంటాను. గంగా సరయుల సంగమాన్ని చూడాలని నాకూ అశగా ఉంది" అన్నాడు.

వీరిలా మాట్లాడుకుంటున్నపుడు అక్కడికి సుదూరంలో మరొకవ్యక్తి కూడా 'సిద్ధాశ్రమమే నా అసలు సిసలు కార్యక్షేత్రం' అని మననం చేసుకుంటున్నాడు. అతనే విశ్వామిత్రుడు!.

***

## - 13 -

విశ్వామిత్రుడు అయోధ్యలో అడుగుపెట్టాడు. అతని మనసు పరిపరి విధాలుగా ఆలోచిస్తోంది.

'అయోధ్య!... జయింప శక్యము గాని పురమా' నవ్వుకున్నాడు విశ్వామిత్రుడు.

'ఇదే పురములో దశరథుని పూర్వీకుడైన వేనుని ఒక ఆర్యేతరుడు సంహరించినపుడు అయోధ్య పేరు మారలేదే? గంగా తీరాన్ని దాటి తూర్పునకు, దక్షిణదిశకు ఈ దశరథుడు రాడేమి? ఆ రాక్షస ముఖ్యుల పేర్లు వింటేనే వణుకుతాడేమి? అగస్త్యుల వాళ్లు చేస్తున్నది ఈ క్షత్రియుడు చేయడేమి? అధికారము, కీర్తిప్రతిష్టలు భవిష్యత్తులో బ్రాహ్మణుల పరం కాబోతున్నది కదా!ఈ క్షత్రియరాజు చేస్తున్నదేమి? విందులు, విలాసాలు, భార్యలు, దాసదాసీజనం, పిల్లల ముద్దుముచ్చట్లు... అంతే. ఒక ఆశయంలేదు. భవిష్యత్ ప్రణాళిక లేదు. పశువులకు కొత్త బీళ్ళు కావాలి. జనం పెరిగిపోతున్నారు. వేల నాగళ్ళతో భూమిని సాగుకు యోగ్యం చేయాలి. ఆయుధాలకు, పనిముట్లకు లోహం కావాలి. ఇవన్నీ గంగాతీరం దాటితేనే కదా దొరికేది. పుష్కలమైన భూములు అరణ్యాలుగా ఉన్నాయి.

అడవుల్ని కొట్టేయాలి. అడ్డువచ్చిన అనాగరికుల తలలు కొట్టేయాలి. అపుడే కదా రాజ్యం విస్తరించేది! సాటి వాళ్లతో తలపడే కంటే కొత్త భూములకు విస్తరించడం మంచిదని వీళ్లెపుడు గ్రహిస్తారు? వినూత్న ఆయుధాలు చేతిలోకి వస్తున్నాయి. వేగం పదునులతో పాటు అనేక రెట్లు విధ్వంసం కలిగించగల ఆయుధ జ్ఞానం అందుబాటులోకి వచ్చింది. ఆయుధ జ్ఞానంలో మాగాధేయుల్ని మించిన వారున్నారా?' అనుకున్నాడు.

ఆయుధ జ్ఞానానికి సంబందించిన ఆలోచన రాగానే విశ్వామిత్రుడి మనసు పులకరించింది. గర్వంతో ఛాతి విస్తరించింది.

'తనకు మాత్రమే సొంతమైన ఆయుధ జ్ఞానాన్ని అభ్యసించి, ఉపయోగించి క్షత్రియపాలనను విస్తరించగల యోగ్యుడైన యోధుడు కావాలి. చాలా మంది గురించి తరచి తరచి విశ్లేషించాడు. అందరు విలాసాల వ్యసనంలో మునిగి తేలుతున్నారు. భవిష్యత్తుకు హామీ ఇవ్వగల యోగ్యుడు లేడు. ఎవరో ఒకరిని తయారు చేయాలి. ఒక మాట చెపితే చాలు మంచి చెడు విచక్షణ లేకుండా పాపం, పుణ్యం ఆలోచించకుండా ఆర్య సంస్కృతిని దయా రహితంగా నెలకొల్పేవాడు కావాలి. వజ్ర సమాన కఠినత్వం ఉండాలి.

ఆర్య వర్తం ఆకలి తీరాలంటే పెరుగుతున్న బ్రాహ్మణ అధికారం, ప్రాబల్యం అడ్డుకోవాలంటే తాను చేయబోతున్న పని సరియైనదే. ఇది ఒక అనివార్యత! ఆర్య సంస్కృతి విస్తరణలో అగస్త్య పరంపర చేస్తున్న దానిని మించి చేయాలంటే, పెరుగుతున్న నాస్తికమతాన్ని అణచి వేయడానికి ఒక కాఠిన్యమూర్తి కావాలి. అట్లాంటి వాడికే నా సమస్త ఆయుధ జ్ఞానాన్ని అందిస్తాను. నా ఆధీనంలోని సకల ఆయుధ నిపుణుల్ని అతడి వశం చేస్తాను.

యువకులు, వృద్ధులతో లాభం లేదు. నూతన ఆదర్శాలకు వాళ్లు సరితూగరు. ఇప్పటికే వాళ్లు ఏవో కొన్ని బలహీనతలతో ఉండి ఉన్నారు. ఈ మహత్తర కార్యాన్ని సాధించగల వాడిని బాల్యంలోనే ఎంపిక చేసుకోవాలి. ఆ ఆశతోనే కదా అయోధ్యలో అడుగు పెట్టింది.

విశ్వామిత్రుడు తన ప్రణాళికను మరోసారి మననం చేసుకున్నాడు.

'అత్యంత సాహసోపేతమైన, ప్రమాద భరితమైన ప్రణాళిక అది. తన ఎంపిక తప్పు అయితే, పరిస్థితుల్లో కొంత తేడా వచ్చినా... తన ప్రతిష్ట మసక బారుతుంది! విశ్వామిత్రులనే వాళ్లు భవిష్యత్తులో మూర్ఖులుగా మాత్రమే జమకట్టబడతారు. తాను ఎన్నవ విశ్వామిత్రుడన్నా కానీ, తన పూర్వ విశ్వామిత్రుల కంటే గొప్ప అధ్యయన కర్త కాకపోవచ్చు గాక... కాని ఆయుధ జ్ఞానంలోను, వ్యూహ రచనలోను పూర్వ విశ్వా మిత్రుల కంటే మెరుగైన వాడిని...'

రకరకాల ఆలోచనలతో విశ్వామిత్రుడు వేగంగా నడుస్తున్నాడు. దేశదేశాల నుండి వచ్చిన వివిధరకాల ఆయుధ నిపుణులైన తన శిష్యులు అయోధ్య పరిసరాలలోనే నిలిచిపోయారు. వాళ్ల ఉనికిని రహస్యంగా ఉంచవలసి వచ్చింది. విశ్వామిత్రుడిని ఏదో ఉద్వేగం కమ్ముకుంది. అతడు మళ్లీ ఆలోచనలో పడ్డాడు. ఆలోచిస్తూనే నడుస్తున్నాడు.

'తూర్పు ప్రాంతం ఇపుడు ఆదమరిచి ఉంది. అజాగ్రత్తగా ఉంది. అటవీ ప్రాంత అనార్య తెగలు విడివిడిగా ఉన్నాయి. పణులు యధేచ్ఛగా వర్తకం సాగిస్తున్నారు. ఒకే ఒక్క దెబ్బ గట్టిగా కొట్టామంటే వనాలన్ని వణకాలి. ఈ అవకాశం వినియోగించుకోకపోతే మళ్లీ ఎవడో ఒక అగస్త్యుని లాంటివాడు రాక్షస సంహారుడిగా పేరు పొందగలడు. ఆ ఖ్యాతి వారికి దక్కకూడదు.

కావాలనుకుంటే తానే ఈ వనాల్ని లొంగదీయ గలడు. కానీ ప్రయోజనమేమి? వ్యక్తిగత ప్రతిష్ట తప్ప. దీని ద్వారా ఒక భవిష్యత్పాల కుడిని తయారు చేయాలి. కృశాశ్వుల, జయసుప్రభల ఆయుధ జ్ఞానం తనతోనే అంతరించి పోకూడదు. ఎంతమందినైనా ఒంటి చేత్తో నిలువరించగల సామర్థ్యాన్ని ఆ భవిష్యత్ పాలకుడికి అందించాలి.

బాలుడిగా ఉన్నపుడే అతనిలో ఆత్మ విశ్వాసము, కాఠిన్యం నింపాలి. ఆయుధ సంపత్తి అందించాలి'.

"అందుకే కదా తను ఈ యాగం మొదలుపెట్టాడు" అని విశ్వా మిత్రుడు బయటకు అనేసాడు. అతని వెంట ఉన్న శిష్యుడు ఏమి మాట్లాడలేదు. గురువుల వారు తన అభిప్రాయం అడగ లేదని, ఆలోచనల ప్రవాహంలో కొట్టుకపోయి గొణిగాడని అర్థం చేసుకున్నాడు.

కొంత దూరం నడిచాక శిష్యుడిని అక్కడే ఆగమన్నట్టు సైగ చేసాడు. ఆ శిష్యుడు ఆగిపోయాడు. విశ్వామిత్రుడు ముందుకు నడిచాడు.

విశ్వామిత్రుని ఆగమన వార్త వినగానే దశరథుడి మనసు కీడును శంకించింది. తన దగ్గర మాత్రమే విశ్వామిత్రుడు పొందగలిగేది ఏది లేదు. సంపద మాటకు వస్తే అతడు అడగాలే గాని ఇవ్వని వారు ఎవరూ లేరు. గౌరవాలకు లోటులేదు. బ్రాహ్మణవర్గంతో ఆయన పెట్టుకునే వైరం ఎటు దారి తీస్తుందోననే భయం మాత్రం అందరికి ఉంది.

సుమంత్రుని హెచ్చరిక మేరకు ఆలోచనల్లోంచి తేరుకుని భవనం బయటకు దారి తీసాడు. చురుకైన చూపులతో ముఖానికి వన్నె తెస్తున్న గడ్డంతో భుజం మీద జీరాడుతున్న నూలు వస్త్రంతో పెద్దపెద్ద అంగలు వేస్తూ వస్తున్న విశ్వామిత్రున్ని చూసాడు. వినమ్రతతో లోనికి ఆహ్వానించాడు. ఉభయులు కుశల ప్రశ్నలు వేసుకున్నారు. విశాలమైన

కక్ష్య లోకి తీసుకవెళ్లాడు. విశ్వామిత్రుడిని తన ఆసనంపై స్వయంగా కూర్చుండబెట్టాడు. పాదాలకు నమస్కరించి కొద్దిగా పక్కకు జరిగి వినయంగ చేతులు కట్టుకుని నిలబడ్డాడు దశరథుడు.

విశ్వామిత్రుడు చుట్టూ పరికించి చూసాడు. వసిష్ఠుని, జాబాలిని, సుమంత్రుడిని ఇతర ప్రముఖులను పలకరించాడు.

"మీకు చేయగల సేవ ఏదయినా ఉంటే సెలవివ్వండి" అన్నాడు దశరథుడు వినయంగా.

విశ్వామిత్రుడు ఏమి మాట్లాడలేదు. సుమంత్రుడు వసిష్ఠుడు అతడి మనసు లోతుల్ని తెలుసుకోవడానికి ప్రయత్నిస్తున్నారు. అప్పటికే వారివద్ద కొంత సమాచారం ఉంది. కోసలకు అవతల కొత్త వ్యక్తుల కదలికలు ఎక్కువయ్యాయి. రకరకాల ఆయుధ నిపుణులు విశ్వామిత్రుని చేరుతున్న వార్తలు వచ్చాయి. నిజానికి ఇది కొత్త విషయమేమి కాదు. కృశాశ్వులు చేసిన పరిశ్రమ విశ్వామిత్రుని ఆధీనంలోకి వచ్చాక ప్రతి సంవత్సరము ఒక్కసారయినా వాళ్లు అతడిని దర్శించుకొని ఆశీర్వాదాలు పొందు తుంటారు. కాని ఈసారి వాళ్ళు అతడిని దర్శించుకున్నాక ఎవరి ప్రాంతా లకు వాళ్ళు వెళ్ళకుండ సరయు ఆవల చిన్న చిన్న బృందాలుగా విశ్రమించారని అంటున్నారు వేగుల వాళ్ళు.

కాని దీన్ని పూర్తిగా రూఢిగా చెప్పలేకపోయారు. విశ్వామిత్రుడి మౌనం దశరథుడిని కలవరపెట్టింది.

"మహాత్మ, ఈ రాజ్యమూ, నేనూ, నా సంపద సమస్తమూ మీ ఆధీనం. మీరు ఏది కావాలంటే అది తీసుకునే హక్కు మీకుంది" అన్నాడు దశరథుడు గౌరవ భక్తి ప్రపత్తుతలతో.

"దశరథా! మాట ఇవ్వడంలోనూ, ఇచ్చిన మాటను నిలబెట్టుకోవ

డానికి ఎంతటి కష్టాన్నైనా భరించి సర్వం అర్పించుకోగల మీవంటి సత్యసంధత కలిగిన వంశం... సమస్త భూమండంలో ఎంత వెతికినా దొరకదు. పరిపూర్ణ జీవితం గడుపుతున్న నీవు ధన్యుడివి" అన్నాడు విశ్వామిత్రుడు.

గర్వంతో, సంతోషంతో ఉప్పొంగి పోయాడు దశరథుడు.

"మా పూర్వీకుల సంస్కారం నా రక్తంలోనూ ఉంది మహర్షీ" అన్నాడు వినయం ధ్వనిస్తున్న గొంతుతో.

"ఏమో, నీవు మాట తప్పగలవేమో" అన్నాడు విశ్వామిత్రుడు ఎటో చూస్తూ అన్యమనస్కంగా. ఆ మాట ఎక్కడ తాకాలో అక్కడ తాకింది.

"లేదు లేదు పూజ్యుడా, సాక్షాత్తు పితామహుడే ఆజ్ఞాపిస్తున్నట్లుగా భావిస్తాను. మీ అంతటివారు నన్ను ఆదేశించడానికి సంకోచిస్తే... అది కూడా అప్రదిష్టే అవుతుంది నాకు" దీనంగా అన్నాడు దశరథుడు.

తిరిగి రాజసం ఉట్టిపడుతున్న గొంతుతో "నా సమస్త రాజ్యమూ, సంపద, బలగం మీ పాదాల చెంత అర్పిస్తున్నాను. ఇక ఇవన్నీ మీ పరం. మీకు సంబంధించిన దానిలోంచి మీరే తీసుకోవడానికి సంకోచమెందుకు స్వామీ! మీ ఇచ్ఛ మేర గ్రహించి ఈ దాసుడిని తరింపజేయండి" అన్నాడు వేడుకోలుగా.

అతడి త్యాగనిరతికి, పెద్దల యెడ చూపే భక్తి ప్రపత్తులకు విశ్వామిత్రుడు ఆశ్చర్యపడ్డాడు. అయినా కర్తవ్యం గుర్తుకు వచ్చింది.

కొంతసేపు నిశ్శబ్దం ఏర్పడింది. పరిస్థితిని గమనించిన సుమంత్రుడు దశరథుడి అనుమతితో అందరినీ పంపించి వేసాడు. ఆ సభా ప్రాంగణంలో విశ్వామిత్రుడు, దశరథుడు, మంత్రులు, పురోహితులు

తప్పు ఎవరూ లేరు.

దశరథుడి వైపు తీక్షణంగా చూస్తూ

“అధికారం, ఐశ్వర్యాలు మాకు కొత్త కాదు. అవి మాకు దుర్లభమూ కాదు. నేను కోరుతున్నది వాటిని కాదు. నాకు కావలసింది నీ రాముడు. నాకు రాముడు కావాలి దశరథా!” అన్నాడు విశ్వామిత్రుడు ఒక్కో మాటను ఒత్తి పలుకుతు.

సభలో కలకలం రేగింది.

***

## -14-

నిశ్చేష్టుడయ్యాడు దశరథుడు. కొంతసేపు ఏమి అర్థం కాలేదు. 'అడుగుతున్నది రాముడినా? ఎందుకు? తనలాగే వనవాసిగా చేస్తాడా? ఇందులో ఏదయినా కుట్రలేదు కదా' దశరథుడి మనసు పరిపరి విధాలుగా ఆలోచిస్తున్నది.

విశ్వామిత్రుడంతటి వాడు పనిగట్టుకుని అయోధ్యకు వచ్చి తన సింహాసనం మీద కూర్చుండి తనతో కాసేపు హాస్యమాడి పోవడానికి రాలేదని తెలుసు. విశ్వామిత్రుడి కోరిక పిడుగు లాగా దశరథుని చీల్చింది. మంత్రులకు, పురోహితులకు ఏమి అర్థం కావడం లేదు. వసిష్టుడు జాబాలి అయోమయంలో పడ్డారు. సుమంత్రుడికి మాత్రం కొంత అర్థమవుతున్నట్లు అన్పించసాగింది. కాని స్పష్టత రావడం లేదు.

"రాముడా... ఎందుకు స్వామి?" వణుకుతున్న గొంతుతో అడిగాడు దశరథుడు.

విశ్వామిత్రుడు దశరథుని పై నుండి చూపులు తిప్పుకోవడం లేదు. తను వచ్చిన పని అంత త్వరగా ముగిసేది కాదని అతడికి తెలుసు.

"దశరథా, మేం యాగం నిర్వహించ తలపెట్టాము. కొంత మంది రాక్షసులు దాన్ని విఘ్నం చేస్తున్నారు. యాగ రక్షణ కొరకు రాముడిని పంపు" అన్నాడు విశ్వామిత్రుడు.

దశరథుని గుండెలు అదిరాయి.

"బ్రహ్మర్షి! నా రాముడు పదునారేండ్లు కూడా నిండని వాడు. ఇంత చిన్న వయసులో క్రూర రాక్షసులతో పోరాడగలడని అనుకోను. ఇంతకీ యాగం ఎక్కడ స్వామి? ఆ రాక్షసులెవరు?" అడిగాడు దశరథుడు.

అందుకు విశ్వామిత్రుడు "యాగ వేదిక సిద్ధాశ్రమం, యాగ విరోధులు మారీచ సుబాహులు. రాజా! సందేహాలు పెట్టుకోకుండా రాముడిని నా వెంట పంపు. నా అండదండలతో ఆ రాక్షసులను అతడు సంహరించగలడు. దీని వలన రామునికి చాలా విధాలుగా శ్రేయస్సులు సమకూరుతాయి. యజ్ఞదీక్షలో ఉండే నేను రాక్షసులను శపించడం యుక్తం కాదు. అందుకే ఈ కోరిక కోరవలసి వచ్చింది" అన్నాడు అనునయంగా.

సిద్ధాశ్రమం, మారీచ, సుబాహుల పేర్లు వినగానే దశరథునిలో జీవకళ తప్పింది. భయంతో వణికాడు. సుమంత్రుడికి కొంతకాలం క్రితం నుండి జరుగుతున్న పరిణామాలు ఒకదానితో ఒకటి పొంతన కుదిరి కొంత స్పష్టత రాసాగింది. కాని 'రాముడెందుకు' అన్నది వాళ్లకి పూర్తిగా అవగతం కావడం లేదు.

దశరథుడు గొంతు పెగుల్చుకొని

"మహర్షీ కావలసింది యాగ సంరక్షణే కదా. నేను నా సమస్త సైన్యం మీ వెంట నడుస్తాము. మా బొందిలో ప్రాణమున్నంత వరకు యాగాన్ని రక్షిస్తాము. పసివాడయిన రాముడిని మాత్రం కోరవద్దు.

సిద్ధాశ్రమం గురించి మారీచ సుబాహుల గురించి వినని వాళ్లమెవరం? మునీశ్వరా ఏఏ ఆయుధాలతో ఎంత సైన్యాన్ని వెంట తీసుకురావాలో సెలవివ్వండి" అన్నాడు దశరథుడు.

"ఘనమైన రఘు కులంలో పుట్టిన దశరథుడా, కార్యం నిర్విఘ్నంగా పూర్తి కావాలంటే బలాన్ని బుద్ధిని రెండింటిని ఉపయోగించాలి. నీవూ, నీ సైనిక సంచారం రాక్షసులని రెచ్చగొట్టినట్లవుతుంది. వాళ్లు బలగాల్ని మరింత సమకూర్చుకుంటారు. దట్టమైన అటవీ ప్రాంతాలు వాళ్లకు కొట్టిన పిండి. సైనిక హడావిడి వల్ల తూర్పుదక్షిణ ప్రాంతాల రాక్షసులు ఏకత్రిధము అవగల అవకాశాల్ని వాళ్లకు ఇచ్చినట్లవుతుంది. అదే జరిగితే మనకు దాన్ని మించిన నష్టం మరొకటి ఉండదు. వాళ్లు అక్కడితో ఆగుతారంటావా? ఇంకా ముందు పురోగమించాలని వస్తే ఆర్యవర్తానికి ఎంత ప్రమాదమో ఆలోచించు. ఏమైంది నీ రాజనీతిజ్ఞత?" అన్నాడు విశ్వామిత్రుడు.

దశరథుడి కేమి పాలుపోలేదు. 'ఆ యాగమేదో ఈ అయోధ్య లోనో వాటి పరిసరాలలోనో చేసుకోవచ్చు కదా. సిద్ధాశ్రమం ఎందుకు?' అదే విషయాన్ని భయంభయంగా అడిగాడు దశరథుడు.

చిన్నగా నవ్వాడు విశ్వామిత్రుడు. దశరథుడు తొందరగా లొంగేలా లేడు అనుకున్నాడు.

"రాక్షసుల ఆయువు పట్టు సిద్ధాశ్రమం. దాన్ని కొట్టగలిగేవాడు లోకోత్తర వీరుడిగా కీర్తి గడిస్తాడు. అంతటి కీర్తి రాబోతుంటే మోకాలితో అడ్డుకోకు దశరథా. సిద్ధాశ్రమంలో ఇప్పటివరకు బహుదా మాతృ దేవతలుండేవారు. కొత్త మతమొకటి అక్కడ వేళ్ళూనుకుంటోంది. విచిత్రమైన సమ్మేళనం జరుగుతుందక్కడ. భవిష్యత్‌లో తూర్పుదక్షిణ

ప్రాంతాల్లోని అనార్య తెగల్లో గొప్ప ఐక్యత రాబోతుంది. అదే జరిగితే వాళ్ళని ఎవరూ కదిలించలేరు. అన్నీ అధ్యయనం చేసాకే నిన్ను ఈ కోరిక కోరాను. నా శక్తియుక్తుల మీద విశ్వాసముంచి రాముడిని పంపు" చెప్పాడు విశ్వామిత్రుడు.

దశరథుడితో సహా అక్కడున్న వారందరికి సిద్ధాశ్రమంలో యాగ నిర్వహణ అనేది అక్కడి రాక్షసులను రెచ్చగొట్టడానికే అని అర్థమయింది. సిద్ధాశ్రమంలో హెూమాగ్ని నిషిద్ధం. అది చేసేవాళ్ళ అంతు చూస్తారు రాక్షసులు. ఈ యాగమే వాళ్ళని రెచ్చగొట్టడానికి. అందులోను రక్షణ కొరకు రాముడట! అక్కడున్న వాళ్ళకు ముచ్చెమటలు పట్టాయి. సిద్ధాశ్రమంలో యాగము, ఆయుధాలతో సంచరించడము ఆర్యవర్త వాసులకు ఊహకందని విషయము. ఆయుధాలతో కనిపిస్తే చిత్రవధ చేసి మరీ చంపుతారు రాక్షసులు.

దశరథుడు చేతులు జోడించాడు.

"మహర్షి మీరు సంకల్పించిన కార్యము లోక కళ్యాణం కొరకే అని నమ్ముతున్నాను. కానీ ఈ దుర్భర వేదన నుండి నన్ను తప్పించండి స్వామి. లేక లేక కలిగిన కుమారుల్లో రాముడు నాకు అత్యంత ప్రియ మైనవాడు. సైనిక సంచారమే వద్దనుకుంటే నేను ఒక్కడిని మీ వెంట వస్తాను. అందులోనూ రాముడికి అస్త్రవిద్యలు తెలుసుకానీ, రాక్షస సంహారానికి సన్నద్ధత లేదు. కోరి కోరి రాక్షసుల ఎదుటికి రామున్ని ఒంటరిగా పంపలేను. ప్రత్యామ్నాయం సెలవివ్వండి స్వామి. శిరస్సు వంచి వేడుకుంటున్నాను" అన్నాడు వణుకుతున్న గొంతుతో.

ఆసనం నుండి దిగ్గున లేచాడు విశ్వామిత్రుడు.

"సత్యసంధత కలిగిన దశరథా" అన్నాడు పెంచిన స్వరంతో

ఒక్కొక్క అక్షరాన్నే నొక్కి నొక్కి పలుకుతూ.

"పుత్ర వాత్సల్యంతో అంధుడివై పోయావు నీవు. ప్రత్యమ్నాయం అడుగుతున్నావు. ఈ రాక్షస సంహారం నేను నా శిష్యగణం చేయగలం. నీవూ నీ రాముడు అవసరం లేదు" అన్నాడు విశ్వామిత్రుడు కఠినంగా.

అదే ఊపులో సుమంత్రుడి వైపు, వసిస్టుడి వైపు తిరిగి అన్నాడు.

"వసిష్టా, మంత్రులారా వినండి. రాముడు నిమిత్తమాత్రుడు. రాముడు ఒక సాధనం. అతడి భద్రతకు నేను హామీ! నా సమస్త శక్తులు రాముడికి అండగా ఉంటాయి. జరగబోయే రాక్షస సంహారం రాముడి ద్వారా జరగాలి. ఇది కోసలకే కాదు. సమస్త ఆర్యవర్తానికి మేలు చేస్తుంది. నా సకల శక్తులు కూడదీసుకుని ఈ కార్యానికి పూనుకున్నాను. కాని చేయి చాచి అర్థించి మోసపోయాను" అన్నాడు కటువుగా.

దశరథుని వైపు తిరిగి వేలెత్తి చూపిస్తూ హెచ్చరించే గొంతుతో ఇలా అన్నాడు. అది సభా భవనమంతా ప్రతిధ్వనించింది.

"రాజా! నీ పూర్వికుల వలె నీ కీర్తి చిరకాలం నిలచి ఉంటుంది. కాకపోతే అసత్యవాదిగా!... సరే... ఈ రాజ్యాన్ని ఏలుతూ ఇక్కడే శాశ్వతంగా సుఖంగా ఉండు" అంటూ ముందుకు నడవబోయాడు విశ్వామిత్రుడు.

దశరథుడు తలవంచి జోడించిన చేతులు విడువకుండానే అతని ఎదుటకు ఒకడుగు ముందుకు వేసాడు. అంతలో వసిష్ఠుడు కలుగ చేసుకున్నాడు.

"మహర్షి! కోపగించుకోకు మీ కోరికలోని అంతరార్థం మహారాజు గ్రహించలేక పోతున్నారు. మీరు శాంతించండి. కాసేపు విశ్రమించండి. మా ఆతిథ్యం స్వీకరించండి. దశరథుడితో ఒకసారి మాట్లాడే సమయ

మివ్వండి మాకు” అన్నాడు వేడుకునే ధోరణితో.

విశ్వామిత్రుడు ఆసనంలో తిరిగి కూర్చున్నాడు. సుమంత్రుడే స్వయంగా తినుబండారాలు, ఫలాలు, తీపి పదార్థాలను పాత్రలలో వడ్డించాడు. దశరథుడిని పక్కనున్న కక్ష్య లోకి తీసికెళ్ళారు.

వసిష్ఠుడు విశ్వామిత్రుని వద్దకు తిరిగి వచ్చాడు. కాసేపు విశ్వామిత్రునితో అదీ ఇదీ మాట్లాడారు. యాగ రక్షణ కోసం విశ్వామిత్రుని సన్నద్ధత అతని ఆంతర్యం ప్రణాళిక తెలుసుకోవడానికి ప్రయత్నించారు వసిష్ఠ సుమంత్రులు.

వారు తమ వద్ద ఉన్న సమాచారంతో విశ్లేషించుకున్నారు. విశ్వామిత్రుడు ప్రతీది ముభావంగ సూచన ప్రాయంగ చెప్పాడు. అర్థం కానిదల్లా రాముడినే ఎందుకు తీసుకు వెళ్లాలనుకుంటున్నాడు? అర్థం అయిన విషయం రాముడి భద్రతకు ప్రమాదం ఏమి లేదు అని!

వసిష్ఠుడు స్పష్టంగా అడిగాడు.

“ఇంత సాహసం అవసరమైన ఆ యాగం ఏమిటి? దాని పేరేమిటి? ఏ ఋత్విజులు వస్తున్నారు? దాని పుణ్య ఫలం ఏమిటి? సిద్ధాశ్రమంలో మాత్రమే చేయగల ఆ యాగ విశిష్టత ఏమిటి?”

విశ్వామిత్రుడికి చిర్రెత్తుకొచ్చింది. తనపై బ్రాహ్మణాధిక్యతకు పూనుకుంటున్నాడు అనిపించింది.

“మీరున్నది నన్ను సమాధానపరచడానికా? దశరథుని ఒప్పించడానికా? వివరాలన్ని చెప్పి మమ్మల్ని వేడుకుంటే తప్ప రాముడిని పంపడానికి దశరథుని ఒప్పించరన్న మాట! ఏమిటీ మీ అహంకారం? రాజు కన్నా భృత్యులు అహంకారులై ఉంటారనే నానుడి నిజమనిపిస్తోంది మిమ్మల్ని చూస్తుంటే” అన్నాడు కోపంగా.

దీంతో వాళ్లకు స్పష్టమయింది. యాగం సాధారణమైనదే. అది ఒక నెపం మాత్రమే. ఆ యాగం చేయకపోతే ప్రపంచం తలక్రిందులై పోదని తెలుస్తూనే ఉంది. విశ్వామిత్రుడి మాట మన్నించక పోతే మాత్రం దశరథుడి కీర్తి ప్రతిష్టలు మంట గలవడం వాస్తవం. అంతేకాక దశరథుడు అసత్యవాది అనీ, రాముడు పిరికివాడు, అసమర్థుడు అనే ప్రచారం జరిగే అవకాశం ఉంది. విశ్వామిత్రుడు చాప కింది నీరులా ఇంకేం తలపెడతాడో తెలియదు. వాళ్లిద్దరూ దశరథుని వద్దకు వెళ్లారు.

దశరథునికి ఏకాంతం కల్పించమని సూచన ఇచ్చాడు సుమంత్రుడు. అందరు నిష్క్రమించారు. దశరథుడు, వసిష్ఠుడు, సుమంత్రుడు, జాబాలి మాత్రమే ఉన్నారు ఆ గదిలో.

మంతనాలు కాసేపు మాత్రమే జరిగాయి. వసిష్ఠుడు చెప్పాడు.

“యాగ రక్షణ గురించి మనం మరీ బెంబేలెత్తుతున్నాం. సిద్ధాశ్రమ రాక్షసులు బాలురకు హాని తలపెట్టరు. అలాగని వారి మంచితనం మీదనే ఆధారపడవలసిన అవసరం లేదు. విశ్వామిత్రుడు స్వయంగా యోద్ధ! సర్వ అస్త్ర శస్త్ర విద్యలలో నిపుణుడు. వీరుడే కాదు మంచి వ్యూహకర్త. అట్లాంటి వాడే రాముడి రక్షణకు పూచీ పడుతున్నాడు. అంతేకాదు దీనివల్ల మరొక లాభం కూడా ఉంది. విశ్వామిత్రుని ఆధీనంలోని అస్త్రజ్ఞానం, ఆయుధాలు రాముడి పరం అవుతాయి. రాముడికి గొప్ప గురువు సాంగత్యం లభించినట్లవుతుంది. అతడిని పూర్తి స్థాయి యోధుడిగా విశ్వామిత్రుడు మలచగలడు. సుధన్వుడు తనకు తెలిసిన విద్యనంతా రాముడికి నేర్పాడు. కాని ఎంతో ఉత్సాహము, పట్టలేనంత శక్తి, సునిశితమైన మేధ కలిగిన రాముడికి అది మాత్రమే సరిపోదు. మనము వినని చూడని అస్త్రజ్ఞానం విశ్వామిత్రుని వద్ద

రాముడు పొందగలడు. పాలకుడికి అవసరమైన జ్ఞానమూ విశ్వామిత్రుడు అందించగలడు.

నాకైతే రాముడిని పంపడమే భావ్యమనిపిస్తోంది. కాదనడం వల్ల నీవు అసత్యవాదిగా మిగిలిపోతావు. రాక్షసుల పేరెత్తగానే చేతులెత్తేసిన వాడిగా ఉండి పోతావు. రాముడు బలహీనుడని ప్రపంచానికి నీవే చాటి చెప్పినట్లవుతుంది. రాముడికి అపురూపమైన అస్త్రజ్ఞానం అంద కుండా చేసినట్లవుతుంది" అన్నాడు వసిష్ఠుడు.

దశరథుడు ఏమి మాట్లాడలేదు. అతని మనసు ఊగిసలాడుతున్నది. సుమంత్రుడు ఇలా అన్నాడు.

"మహారాజా, గత కొద్ది రోజులుగా అయోధ్య పరిసరాలలో తచ్చాడిన వ్యక్తుల సమాచారం మీకు నివేదించాను కదా. ఆ విషయం లోనే ఆ రోజు విశ్వామిత్రుని ప్రస్తావన తీసాను. ఈ పరిణామాలన్నింటితో నాకు అర్థమైనది చెపుతాను. విశ్వామిత్రుడు తన ఆధీనంలోని మేటి నిపుణులైన యోధుల్ని కోసల పరిసరాల గుండా తూర్పువైపు పంపించాడు. వారిలో కొందరు పణులలాగా మరికొందరు ముని కుమారుల లాగా అవతారమెత్తి ఉన్నారు. వారలా ప్రవర్తించడం మొదట నాకూ అర్థం కాలేదు. మనవాళ్లని అప్రమత్తం చేసి ఉంచాను. వాళ్లు అయిదారుగురు కలసి చిన్నచిన్న బృందాలుగా కోసం పరిసరాలలో విడిది చేసి నిన్న మొన్న విడతల వారీగా తూర్పు వైపు ప్రయాణించినట్లు తెలిసింది. ఏ మాత్రం హడావిడి చేయకుండా పొంచి ఉండి తమ పని తాము పూర్తి చేసుకోవడం వాళ్ల వ్యూహం అయి ఉంటుంది. రాముడి రక్షణకు హాని లేదని మాత్రం నేను భావిస్తున్నాను". స్థిరమైన గొంతుతో వివరించాడు.

కొంత సమయం గడిచింది. దశరథుడి మనసు శాంతించింది.

రాముడికి ఏమి కాదనే నమ్మకం బలపడింది. లేచి నిలబడ్డాడు. రాముడిని పిలవమని చెప్పాడు. విశ్వామిత్రుడి వద్దకు వెళ్ళారందరు.

"మహర్షీ! రాముడు సత్వరమే ఇక్కడకు వస్తాడు. మీ వెంట తీసుకు వెళ్లవచ్చు" అన్నాడు వినమ్రంగా చేతులు జోడించి. విశ్వామిత్రుడు సంతోషించాడు.

రాముడు గురించి విని ఉన్నాడు. కాని ఎన్నడూ చూడలేదు. తను అనుకున్న కార్యానికి సరిపోగలడా లేదా అనే సందేహం ఒకటి అతని మనసును పీడించసాగింది.

అంతలోనే రాముడు వచ్చాడు. వస్తున్న రాముడిని తీక్షణంగా చూసాడు. అంత పొడవు కాని, అంత పొట్టి కాని ఎత్తుతో, అంత లాలిత్యము కాని, మరీ అంత కటువు కాని చూపులతో, అందమైన ముఖ వర్చస్సుతో ఉన్న రాముడు స్థిరమైన అడుగులతో విశ్వామిత్రుని సమీపించాడు.

రాముడి గంభీరమైన కళ్ళు విశ్వామిత్రుడిని విశేషంగా ఆకర్షించాయి. మొత్తంగా రాముడిలో ఒక సరళమైన సౌందర్యాన్ని, అంతకు మించిన ఆత్మవిశ్వాసంతో కూడిన గాంభీర్యతను దర్శించి తృప్తి పొందాడు.

రాముడు వచ్చి విశ్వామిత్రుడి పాదాలకు నమస్కరించాడు. దశరథుని పక్కన వినయంగా నిలబడ్డాడు. అంతలో రాముని వయస్సు ఉన్న మరో బాలుడు వచ్చి విశ్వామిత్రుని పాదాలకు నమస్కరించాడు.

సుమంత్రుడు చెప్పాడు 'లక్ష్మణుడు' అని. లక్ష్మణుడు రాముని పక్కన ఒద్దికగా నిలబడ్డాడు.

దశరథుడు, విశ్వామిత్రునితో

"బ్రహ్మర్షీ, నా ప్రియ పుత్రుడిని మీ చేతుల్లో పెడుతున్నాను. ఇక

రాముడికి తల్లీ తండ్రీ గురువూ దైవం మీరే!" అన్నాడు వాత్సల్యం నిండిన గొంతుతో.

రాముడి వైపు తిరిగి

"రామా, గొప్ప తపోధనులు, జ్ఞాన సంపన్నులు అయిన విశ్వా మిత్రుల వారి వెంట వెళ్ళు. వారి ఆదేశం ఏదైనప్పటికీ దానిని నిస్సంకోచంగా పాటించు. వారు చెప్పినారంటే... గురువు స్థానం లోనే కాదు తండ్రిగా నేను చెప్తున్నట్లే భావించు. వారిని మనస్ఫూర్తిగా సేవించు. పెద్దలను గౌరవించడంలో నీకు సాటి రాగలవారు ఎవరూ లేరని కోసల మొత్తానికి తెలుసు. తక్షణమే ప్రయాణానికి సన్నద్ధం అవ్వు" అన్నాడు దశరథుడు రాముడి చేతుల్ని తన చేతుల్లోకి తీసుకుంటూ.

రాముడు అందరికి నమస్కరిస్తూ, విశ్వామిత్రుని వైపు తలవంచి

"నేను ఆలస్యం చేయను. మీరు గడప దాటే లోపు మళ్ళీ ఇక్కడుంటాను" అంటూ వడివడిగా వెళ్లాడు.

లక్ష్మణుడు దశరథుని వైపు తిరిగి

"సోదరునితో వెళ్ళే అవకాశం ఇవ్వమని ప్రార్థిస్తున్నాను. అతని వెంటే ఉండి సోదరున్ని, గురువుల వారిని సేవించుకుంటాను" అన్నాడు అర్థింపుగా.

దశరథుడు ఒక్క క్షణం కూడా తటపటాయించలేదు.

"మహర్షుల వారి అనుమతి తీసుకో. నాకభ్యంతరం లేదు నాయనా" అన్నాడు.

లక్ష్మణుడు, విశ్వామిత్రుడి పాదాలను చేతులతో తడుముతూ మోకాళ్ళ మీద కూర్చున్నాడు.

"నన్ను అనుమతించండి స్వామి" అన్నాడు వేడుకోలుగా.

విశ్వామిత్రునికి విస్మయం కలిగింది. “సరే” అన్నాడు. అతడి నోటి వెంట ఆ మాట వచ్చిందో లేదో లక్ష్మణుడు లేచి సంతోషంతో పరిగెత్తుతున్నట్లుగా వడివడిగా వెళ్ళాడు.

నిజానికి విశ్వామిత్రుడు లక్ష్మణుడిని చూసిన మొదటి చూపు లోనే విభ్రాంతి పొందాడు. వేనవేల ఉరుముల, మెరుపుల చైతన్యాన్ని దాచుకుని నిర్మలంగా అగుపించే ఆకాశంలా కనిపించాడు. తనలో పెల్లుబికే ఉత్సాహాన్ని అదిమి పెట్టుకునే లక్ష్మణుని ముఖంలో తిరుగులేని కఠినత్వాన్ని చూసాడు విశ్వామిత్రుడు.

అయితే అతడి లోని అంతులేని భృత్యస్వభావానికి సోదర ప్రేమ తోడు కావడంతో రాముడిని వదిలి ఉండడం లక్ష్మణుడికి చాలా కష్టంగా ఉంటుంది. సోదరుడి సేవ కోసం మాత్రమే అంకితమై ఉన్నట్లు కనిపించే అతని స్వభావం, హావభావాలు చూసాక విశ్వామిత్రుడు నిరుత్సాహ పడ్డాడు.

దశరథుని పుత్రుల గురించి ఇదివరకే చాలాసార్లు విని ఉన్నాడు. ఇరువురు రాణుల్ని సుమిత్ర సేవించుకునే తీరు తెలుసు. సుమిత్ర తన పిల్లలిద్దరిలో ఒకరిని కౌసల్య తనయుడు రాముడికి భృత్యుడిగా మరొకరిని కేకేయ తనయుడు భరతుడికి సేవకుడిగా మార్చింది. దక్షిణ కోసల రాచబిడ్డ కౌసల్య. కేకేయ రాజు గారాల పట్టి కైకేయి. రెండు గొప్ప కుటుంబాల మధ్య సుమిత్ర ఒద్దికగా నడుచుకుంటుందని కోసల అంతటా ప్రసిద్ధి. కాని రాముడు, భరతుడు తమ సోదరులైన లక్ష్మణ, శతృఘ్నుల పట్ల అమితమైన ప్రేమతో ఉండేవారు. నలుగురు సోదరుల ఆప్యాయతాను రాగాల గురించి అందరూ చెప్పుకునేవారు. అయినప్పటికీ సర్వకాలాల్లో లక్ష్మణుడు రాముడిని, శత్రుఘ్నుడు భరతుడిని అంటి పెట్టుకుని

ఉండేవారు.

వీడ్కోలు తీసుకొని రామలక్ష్మణ, విశ్వామిత్రులు అయోధ్యను దాటారు.

***

వక్షస్థలానికి కవచాన్ని చేతులకు ఉడుము చర్మపు తొడుగులను ధరించిన రామలక్ష్మణులు విశ్వామిత్రుని వెంట గుర్రాలనధిరోహించి ప్రయాణిస్తున్నారు. భుజాలకు ఇరువైపులా తూణీరాల్ని అమర్చుకున్న వారిద్దరు మూడు తలల నాగుల్లా కనిపించసాగారు. సరయూ నదికి దక్షిణాన ఒకటిన్నర యోజనాలు ప్రయాణించారు. సాయంకాలమయ్యింది. గుర్రాలను ఆపారు కాస్సేపు విశ్రమిద్దామన్నాడు విశ్వామిత్రుడు. ఇక నుండి ప్రయాణం కాలి నడకనే సాగుతుందన్నాడు.

సరయూ ప్రశాంతంగా ప్రవహిస్తోంది. నీటి గలగలల చప్పుడు ఒడ్డున పరచుకున్న పచ్చిక వాళ్ళను సేద తీరుస్తోంది.

విశ్వామిత్రుడు సరయులోకి దిగాడు. కాళ్ళు, చేతులు శుభ్రంగా కడుక్కొన్నాడు. ఆచమనాది కార్యక్రమాలు పూర్తి చేసుకున్నాడు. దగ్గర్లో ఉన్న చెట్ల తోపుల్లోకి నడిచాడు. రాముడిని వెంట రమ్మన్నాడు. వినయంగా రాముడు అనుసరించాడు. లక్ష్మణుడు వారి వంకే నిశ్చలంగా చూస్తూ నిలబడ్డాడు.

విశ్వామిత్రుడు రామునికి అక్కడక్కడ కొన్ని మొక్కల్ని చూపుతూ వివరిస్తున్నాడు. వాటి ఆకుల ఆకారాల్ని ఇతర విశేషాలను తెలుపుతు న్నాడు. వెతికి వెతికి రెండు రకాల మొక్కల్ని పెకిలించి చేతుల్లోకి తీసుకుని రామునికి చూపుతూ ఇలా అన్నాడు.

"వీటిని విడి విడిగా సేవిస్తే పెద్ద ప్రభావం ఉండదు. అదే వీటిని

కలిపి సేవిస్తే దీర్ఘ సమయం పాటు ఆహారం లేకున్నా నీరసం ఉండదు. నిద్ర లేకున్నా అలసట ఉండదు. శరీరం లోపలి అంతర్గత బలాన్ని ఇవి మేల్కొలుపుతాయి. ఇవి చాలా విశిష్టమైన ఔషధ మొక్కలు. ఇంకా వీటిని బల, అతి బల మంత్రాలు జపిస్తూ సేవిస్తే ఇక నీకు తిరుగుండదు" అన్నాడు విశ్వామిత్రుడు.

అతడి మాటలను శ్రద్ధగా విన్నాడు రాముడు.

"రామా ఆచమనమొనర్చిరా. శుభ్రమైన శరీరం, శుచియైన మనసు మాత్రమే మంత్రాలను గ్రహించగలవు" అన్నాడు విశ్వామిత్రుడు.

అన్నదమ్ములిద్దరూ ఆచమనము ముగించుకుని వచ్చారు. రాముడు విశ్వామిత్రుని కెదురుగా కూర్చున్నాడు. మహర్షి చెప్పిన మంత్రాలను పదే పదే వల్లె వేసాడు.

రాముడు ఆ మొక్కలను చేతుల్లోకి తీసుకున్నాడు. వాటిని చూస్తుంటే అతని మనసులో ఒక భావం కదిలి సంతోషం ముఖం నిండా పరుచు కుంది.

'ఇవి రామలక్ష్మణుల్లాంటివే. వీటిని కలిపి సేవిస్తే అమోఘమైన బలం. మేమిద్దరం కలిసి కలబడితే మాదే ఆధిపత్యం'.

లక్ష్మణునితో కలిపి కాకుండా విశ్వామిత్రుడు ఆ మంత్రాన్ని తనకు మాత్రమే నేర్పడమేమిటి అనే ఆలోచన ఒక్కక్షణం రాబోయింది రాముడికి. కాని అలవాటయినతనం ఆ భావాన్ని మొగ్గలోనే తుంచేసింది.

లక్ష్మణుని వైపు చూసాడు రాముడు. అతడి ముఖం నిర్వికారంగ ఉండడం గమనించాడు. రాముడి సంతోష వదనం చూడగానే లక్ష్మణుని ముఖం విప్పారింది.

ముగ్గురూ సరయూ నదీ తీరం చెంత విశ్రమించారు. సోదరు

లిరువురు విశ్వామిత్రుని పాదము లొత్తుతూ అతడు చెప్పే కథలు వింటూ గడిపారు. కొంత సేపటి తర్వాత తృణశయ్యపై నిద్రించారు.

రాచభోగాలు అలవాటయిన శరీరాలకు ఆ గడ్డిపాన్పు మొదట అసౌకర్యంగా అన్పించినా ప్రయాణ బడలిక వారిని గాఢ నిద్రలోకి నెట్టింది.

***

నది ఒడ్డున గురుశిష్యులు ఆదమరచి నిద్రించారు. ప్రయాణపు అలసట జోలపాటలాంటి నదీ ప్రవాహపు గలగలలు... చల్లటి గాలి వారి శరీరాన్ని సేదదీర్చింది. అందరికన్న ముందు విశ్వామిత్రుడు మేల్కొన్నాడు. ప్రకృతిలోని ప్రతి శబ్దాన్ని విన్నాడు. ఆస్వాదించాడు. లేచి కాలకృత్యాలు తీర్చుకుని వచ్చాడు.

రాకుమారులిద్దరు ఎలా పడుకున్నారో అలాగే ఉన్నారు. వెలుగు రేఖలు నేలమీద పరుచుకోవడానికి ఇంకా చాలా సమయం ఉంది.

ఆ మసక వెలుతురులో వాళ్ళిద్దరు చూడముచ్చటగా ఉన్నారు. "దాసదాసీజనం మధ్య సకల విలాసాలతో గడిపే బాలురు ఈ చిట్టడవిలో తృణశయ్యపై నిదురించడం విశేషమే..." వారిపట్ల అతని మనసు ప్రేమతో ఉప్పొంగిపోయింది.

"కౌసల్య ముద్దుల గారాల పట్టీ రామా! నిదురలే... నీవు చేయాల్సిన లోకకళ్యాణ పనులు మునుముందు దండిగా ఉన్నాయి. లే రామా..." అంటూ మృదువుగా మాట్లాడుతూ నిదుర లేపాడు.

విశ్వామిత్రుడి నోటినుండి మాట మొదలయిందో లేదో లక్ష్మణుడు దిగ్గున లేచి కూర్చున్నాడు.

రాముడు కూడా మేల్కొన్నాడు. ఇద్దరు గురువుకు నమస్కరించి

కాలకృత్యాలు తీర్చుకుని వచ్చారు. తేనె పూసిన రొట్టెలను ఆరగించారు.

"దేవతలకు ప్రీతి చేకూర్చడానికి వెళ్ళేవారికి ఇంద్రుడు అన్నీ సమకూరుస్తాడు. ఆహారం ఆయుధాలకు లోటు ఉండదు" అన్నాడు విశ్వామిత్రుడు తృప్తిగా దీర్ఘమైన శ్వాసను వదులుతూ.

లక్ష్మణుడికి కొన్ని సందేహాలు కలుగుతున్నాయి. మొదటి నుండి తమను కొంతమంది అనుసరిస్తున్న విషయాన్ని పసిగట్టాడు. అయితే వాళ్ళ వేషధారణ పణుల్లా, మునికుమారుల్లా ఉన్నప్పటికీ సందేహాస్పద మనిపించింది. నిజానికి వాళ్ళు తమను అనుసరించి ఉన్నారో లేదో కూడా తేల్చుకోలేక పోయాడు. వాళ్ళ దగ్గర చాలా సరంజామ ఉండ డం అయోధ్య పరిసరాలలోనే కనిపెట్టాడు.

అయితే వాళ్ళు శత్రువులు కారనే నమ్మకం దృఢంగా ఉంది. శత్రువులే అయితే తమమీద దాడి చేయగల అవకాశం ఉన్న ఎన్నో ప్రాంతాల్లో అలాంటి ప్రయత్నం జరగకపోవడం అతని నమ్మకాన్ని బలపరచింది. అనవసరంగా నీడల్ని చూసి తానే భ్రమలకు లోనవుతు న్నాడేమో అనుకున్నాడు. గురుశిష్యులు చాలా దూరం అడవిలో నడిచారు. నడుస్తున్న కొద్దీ అడవి చిక్కబడడం ప్రారంభించింది. జనం రాకపోకల ఆనవాళ్ళు ఏవి లేవు. ఎక్కడా గొడ్డలి వేటు పడిన ఛాయలు లేవు. ఒక్కోసారయితే దట్టమైన చెట్లు తీగలు అల్లుకొని కొన్ని ప్రాంతాలు చిమ్మచీకటిగా దీపమే వెలగని గదుల్లాగా అనిపించాయి. బాస పక్షుల అరుపులు ఆగకుండా వింటున్నారు. రకరకాల మృగాల అరుపులతో ఆ ప్రాంతం మారుమోగిపోతోంది.

'అడవి అంటే ఇది' అనుకున్నారిద్దరు. నడుస్తూనే ఉన్నారు. అక్కడక్కడ అస్పష్టంగా కొన్ని ఆవాసాలు... బహుశా చాలా సంవత్సరాల

కిందటివి అయి ఉంటాయి. నిండా మొలచిన మహా వృక్షాలు వాటి ఉనికిని కప్పివేసాయి. నిజానికి అవి ఒకప్పటి ఆవాసాలని గుర్తు పట్టడం కూడా కష్టమే.

లక్ష్మణుడికి ఆసక్తి కలిగింది. అడగబోయి ఊరుకున్నాడు. విశ్వామిత్రుడు తనతో అంటీముట్టనట్లుగా ఉండడం మనసుకు కొంత కష్టం కలిగించినా అన్నతో ఉండడం అతనికి అమితమైన సంతోషాన్ని కలిగిస్తోంది.

ఆ రాజభవనాల్ని వీధుల్ని పనిగట్టుక పెంచిన తోటల్ని వదిలి ఇలా అన్నతో సాహసకృత్యం చేయడం అతడిని ఉల్లాసపరుస్తున్నది. లక్ష్మణుడి ఆదుర్దా గమనించిన రాముడు విశ్వామిత్రుని అడిగాడు.

"గురువర్యా, ఏమిటీ అడవి? ఏమి కీకారణ్యం... మనుషుల జాడలేని చెట్ల చిక్కదనం... ఎన్నడూ వినని పక్షుల వింత అరుపులు... క్రూరమృగాల స్వేచ్ఛా విహారం... చంద్ర, నల్లమద్ది, ఏరుమద్ది చెట్లతో మారేడు వృక్షములతో తుమ్మి కలిగొట్టు రేగు చెట్లతో సంకీర్ణమై భయంకరంగా ఉన్న ఈ అడవి పేరేమి...?"

విశ్వామిత్రునికి సంతోషం కలిగింది. 'కాగల కార్యానికి రాముడిని సిద్ధం చేయవచ్చిక' అనుకున్నాడు. నిజానికి అతనికి సహనం తక్కువ. అయితే రాముడి విషయంలో వాత్సల్యం తోనూ ఓపికతోనూ ఉన్నాడు. తనకు తెలిసినదంతా ఒకేసారి చెప్పేయ్యాలనే లోభమూ కలిగింది. కాని తమాయించుకున్నాడు.

ఆదుర్దా, ఉత్సుకతలు విశ్వామిత్రుని మనసుని చెదరగొడుతున్నాయి. ఒకింత సందేహం కూడా ఉంది. 'సరిగ్గా సమయానికి రాముడి లోని సున్నితత్వం మొత్తం ప్రణాళికనే భగ్నం చేస్తుందేమోననే భయం కూడా

ఉంది. కాని రామలక్ష్మణులను సునిశితంగా పరిశీలిస్తుంటే తన ఎంపిక తప్పు కాదని భవిష్యత్తులో అత్యంత శక్తిమంతులుగా రూపొందబోయే వాళ్ళు వీళ్ళేనని నమ్మకం కలుగుతున్నది' అనుకున్నాడు.

'ఆర్యవర్తం ఆకలితో ఉంది. ఆయుధాలకు కావల్సిన లోహం కోసం, లోహాన్ని వెలికి తీయగల దాసుల కోసం దున్నగల భూమి కోసం... రామా! ఆర్యవర్తం ఆకలి తీర్చి అందరి మన్ననలు అందుకో' విశ్వామిత్రుడి మనసు ఉత్సాహంతో నిండింది.

'తాను రాముడనే బాలుడిని పురుషోత్తముడిగా తయారు చేయబోతున్నాడు. మర్యాద పురుషోత్తమునిగా రూపొందించబోతున్నాడు. తోటి ఆర్యులకు గౌరవం మాట మర్యాద మన్నన ఇచ్చే విషయంలో రాముడికి ఎవరూ సాటి రాకూడదు. నిజానికి రాముడు ఇప్పటికే అలా ఉన్నాడు. అనార్యులతో నిర్దాక్షిణ్యంగా వ్యవహరించగల కఠినత్వం విషయంలో అతనికెవరూ దీటుగా ఉండకూడదు. ఇదే కదా ప్రస్తుతం కావల్సింది' అనుకున్నాడు విశ్వామిత్రుడు.

రాముని ప్రశ్న గుర్తొచ్చింది విశ్వామిత్రుడికి. రాముని ఆసక్తిని ప్రశంసించాడు. రాముడి ఆత్మవిశ్వాసాన్ని పెంచడానికి అతడు రాముడితో సంభాషించే ప్రతీసారి ఏదో ఒక ప్రశంసా పూర్వక విశేషణాన్ని ఉప యోగిస్తుంటాడు.

"ఈ ప్రదేశాన్ని మలదకరూశమంటారు రామా" అన్నాడు. గురు వర్యులు ఇంకా కొంత చెప్పబోతున్నారని ఇద్దరూ గ్రహించారు. విశ్వామిత్రుడు చెప్పడానికి గొంతు సవరించుకున్నాడు.

"పూర్వం ఇంద్రుడు వృత్రాసురుని చంపిన తర్వాత కలిగిన మానసిక శారీరక అలసటను పోగొట్టుకోవడానికి ఇక్కడకు వచ్చాడు. అత్యంత

ఆహ్లాదకరంగా ఉండే ఈ ప్రాంతాలు దేవతల చేత నిర్మించబడి ఉన్నాయి. సంపదలతోను సుజనులతోను కలకలలాడుతున్నాయి. ఇక్కడి గాలి నీరు ఆరోగ్య కారకాలు. సేదతీరిన ఇంద్రుడు 'నా శారీరక మానసిక అలసటను, ఆకలిని గ్రహించి నాకు స్వస్థత చేకూర్చిన ఈ ప్రదేశము మలద కరూశమనే పేరు గడిస్తాయి' అన్నాడు. అయితే ఈ ప్రాంతం తాటక అనే యక్షిణి, ఆమె భర్త సుందుడనే వాళ్ల సంచార భూములు. తాటక వేయి ఏనుగుల బలం గలది.కామ రూపిణి. తాటక గురించి నీవు విని ఉన్నావో లేదో తెలియదు. కాని భయపడకుము రామా. సర్వ కాలాల్లోను నీవు క్షేమంగా ఉంటావు.

సుందుడు గొప్ప బలశాలి. వీరి కొడుకే మారీచుడనే రాక్షసుడు. వాడు మహా పరాక్రమశాలి. రామా దుర్మార్గురాలైన తాటక మలద కరూశాలనే ఈ రెండు జనపదాలను నిత్యం ధ్వంసం చేసేది. సుందుడు అగస్త్యుని వలన చనిపోయాడు. అపుడు తాటక మారీచునితో కల్సి అగస్త్యుని చంపడానికి ప్రయత్నించింది. అగస్త్యుడు క్రోధంతో వాళ్ళిద్దరిని శపించాడు. దాంతో అగస్త్య శాపానికి గురైన తాటక మారీచులు కోపంతో ఈ పవిత్ర ప్రదేశాల్ని ధ్వంసం చేస్తున్నారు. తాటక వల్ల ఇతరులెవరు ఇక్కడకు రావడానికి సాహసించలేకపోతున్నారు. అందుకే దేవ నిర్మితములైన మలద కరూశాలు ఇప్పుడు చిట్టడవిగా మారాయి" అన్నాడు విశ్వామిత్రుడు.

ఏ మలద కరూశాల నేలపై నడుస్తూ విశ్వామిత్రుడు రాముడికి ఆ ప్రాంత ప్రాశస్త్యం గురించి వివరిస్తున్నాడో అదే మలద కరూశాల ప్రస్తావన అక్కడికి కొన్ని యోజనాల దూరంలోని అయోధ్యలో జరుగుతోంది.

***

## -15-

"మలద కరూశాలా?..." ఏదో ఆలోచిస్తూ అదే మాటను మళ్లీ వల్లించాడు అష్టకుడు. అతడి ముందర కేశవసనుడు, కాణవి, శంకు కూర్చున్నారు. అపరాతల పర్వత పాదం వద్ద ఆగకుండ అష్టకుడా నేరుగా అయోధ్య వెళ్లడం గురించి తెలుసుకుని ఆమె అక్కడికి వచ్చింది. జాబాలి నివాసంలో కూర్చుని మాట్లాడుకుంటున్నారు.

తిరిగి అష్టకుడే తనలో తాను మాట్లాడుతున్నట్లుగా గొణుక్కున్నాడు.

"పేర్లు మార్చడం రాజనీతిలో భాగమేమో! అవి తాటక వన భూములు. మునుల చిన్నచిన్న సముహాలు అక్కడ తిష్ట వేసి ఆర్యనాయకుడొకడికి ఆశ్రయమిచ్చిన తరువాత పేరు మార్చారు కదా. ఆ భూముల మీద కన్నేయని వాడు ఎవడు?"

అష్టకుడిలో వచ్చిన మార్పును కేశవసనుడు గమనిస్తూనే ఉన్నాడు. గత కొంతకాలంగా అసహనంతో ఉండడం... తరువాత ఈ మధ్య మరీ అంతర్ముఖుడై ఉండడం చూస్తున్నాడు. 'ఇతడొక నూతన మనిషి. దేవుళ్ళ గురించి కత్తులు దూసుకునే మనుషుల్ని చూశాను. ఆరాధన పద్ధతుల గురించి వాదులాడుకునే వాళ్లను చూశాను.

వాటన్నింటిని ధిక్కరిస్తూ అసలు దేవుళ్ళే లేరనే తనలాంటి వాళ్ళూ ఉన్నారు. కాని ఇతడు అందరిలోకి భిన్నంగా ఉన్నాడు" అనుకున్నాడు కేశవసనుడు.

జాబాలి రావడానికి ఇంకా చాలా సమయం పట్టేటట్లుగా ఉంది. ఆ ఇంట్లో వీళ్ళకి స్వేచ్ఛ ఉంది. జాబాలి కుటుంబం వీళ్ళ పట్ల ఆప్యాయతతో ఉంటారు.

గదిలో దీపం మినుకుమినుకుమని వెలుగుతోంది. అష్టకుడి మనసులో జ్ఞాపకాల జ్వాల పెద్దదిగా అవుతోంది. అతని మనసు ఏదో కీడును శంకిస్తోంది. అయోధ్యకు రావడానికి ముందరి పరిణామాలు, వచ్చిన తరువాత అరకొరగా తెలిసిన సమాచారం అతడిని ఆందోళనకు గురిచేస్తోంది.

కాణవి, కేశవసనుడు ఏదో ఒకటి మాట్లాడుకుంటున్నారు. అష్టకుడి మనసు తేలిక చేయడానికి ప్రయత్నిస్తున్నారు. కొన్ని విషయాలు అష్టకుడితో పంచుకోవాలని కాణవి మనసు ఆత్రపడుతోంది. కాని అతడి మానసిక స్థితి చూసి మిన్నకుండిపోయింది.

కొంచెం సేపయ్యాక కేశవసనుడు

"ఒక మాట సూటిగా అడుగుతాను. నీకు ఆర్యులంటే ఎందుకంత ద్వేషం? చెప్పు అష్టకా. నా సంగతి చెపుతాను విను. దైవత్వాన్ని ప్రచారం చేసేవాళ్ల పట్ల నాకు అయిష్టత ఉంటుంది. అదే, మూఢాచారాల్ని సృష్టించి బలవంతంగా రుద్దేవాళ్ళ పట్ల పట్టరాని ద్వేషం నాకు" అన్నాడు.

"ఆర్యులంటే ద్వేషం లేదు నాకు. నా జీవితం యావత్తు వాళ్ళకు వైద్యం చేస్తూనే గడిపాను" అన్నాడు అష్టకుడు దీపం వంక చూస్తూ. తన మాటల్ని పొడిగిస్తూ ఇంకా ఇలా అన్నాడు.

"ఎంతో మంది ఉత్తములైన ఆర్యులను చూశాను. విద్వత్తులో మేటిగా ఉన్నవారిని, ఎప్పుడూ అసత్యమాడని వారిని, ఎంత విపత్కర పరిస్థితుల్లోన్నైనా పక్కవాడి సొమ్ము ఆశించనివారిని చూశాను. ఇంకొక విషయం – దేవుడనే భావాన్ని పక్కన పెడితే ఒక బ్రాహ్మణుడు అంత నిష్టగా ఉండాలంటే ప్రతి దినం... చాలా యాతనగా ఉంటుంది. వాళ్ళ క్రమశిక్షణ చూసి ఒక్కోసారి ఆశ్చర్యం కలుగుతుంది కూడా.

అయితే విషయం అది కాదు. ఆర్యగణ స్వభావం గురించి నా బాధ. ఆర్యేతరులతో కుటిలంగా ఉంటారు. క్రూరంగా ప్రవర్తిస్తారు. వాళ్ళ సంపదను నిర్మొహమాటంగా తీసేసుకుంటారు. అదంతా దైవ కార్యంగా భావిస్తుంటారు. స్పష్టంగా చెప్పాలంటే లోకకళ్యాణం లోకకళ్యాణం అని మాటిమాటికి అంటారే, ఆ లోకకళ్యాణం లోని లోకంలో ఆర్యేతరులు ఉండరు" అన్నాడు అష్టకుడు.

కేశవసనుడికి అతడంటే అవ్యాజ్యమైన ప్రేమ కలిగింది. అష్టకుడి దృష్టికోణమే వేరు అనుకున్నాడు. కాణవి తైలాన్ని తీసుకువచ్చి దీపం చిమ్మెలో పోసింది. వెలుగు కొంచెం ఎక్కువయింది.

"నీవు చెప్పిన లక్షణాలు అనార్య తెగల్లోనూ ఉన్నాయి" అన్నాడు కేశవసనుడు.

అష్టకుడు ఒళ్ళు విరుచుకున్నాడు. అటూ ఇటూ కదిలి సౌకర్యంగా కూర్చున్నాడు. కేశవసనుడి వైపు చూస్తూ.

"ఒప్పుకుంటాను మిత్రమా. బలహీనుడి లోనూ కొన్ని బలహీనత లుంటాయి. అయితే వైద్యుడిని కదా. నా సానుభూతి ఎప్పుడూ దెబ్బ తిన్నవాడివైపే ఉంటుంది. కానీ ఇంకొక మాట– ఆర్యేతరుల్ని హింసిం చడం, వాళ్ళ సంపదని లాక్కోవడం ఆర్యగణాలు తమ బాధ్యతగా,

కర్తవ్యంగా, దైవ కార్యంగా భావిస్తారు. ఇందుకు సాక్ష్యంగా ఎన్నింటిని పాడి చూపంటావో చెప్పు... ఎన్ని సంఘటనలు ఉదహరించాలో చెప్పు అది ప్రమాదకరమైనదీ, దుర్మార్గమైనదని నా అభిప్రాయం. నేను ఇతరులతో విభేదించేది అక్కడే" అన్నాడు అష్టకుడు.

కేశవసనుడు మాట్లాడలేదు. ఆపకుండా ఆవలింతలు వచ్చాయి. అది చూసి కాణవి నవ్వింది.

"ఆగు కేశవసనా ఆగు. నన్నూ ఒక ప్రశ్న అడగనివ్వు. మా అపరాతల పర్వత ప్రాంతం వద్దకు ఒకసారి పేరు మోసిన యోధుడు... పాపం వృద్ధుడు వచ్చాడు. నా పట్ల వాత్సల్యంతో ఉండేవాడు. చాలా విషయాలు మాట్లాడుకునేవాళ్ళం. అతనన్నాడు 'యుద్ధం కాలక్షేపం కోసం చేసేది కాదు. అదో క్రూర కర్మ కానే కాదు. యుద్ధం వల్లనే పాత పాపాలు భూమిపై నుండి తుడిచిపెట్టబడతాయి. ప్రపంచం ముందుకు కదులుతుంది. యుద్ధమే లేకపోతే లోకం గిడసబారి పోతుంది' అన్నాడు. పాపాల సంగతిని పక్కన పెట్టండి. ప్రపంచం ముందుకు కదలాలంటే యుద్ధం తప్పనిసరి కదా" అంది కాణవి నవ్వుతూ.

"ఎవరి పిచ్చి వారి కానందం" అన్నాడు కేశవసనుడు.

"మరి నీ పిచ్చి ఏమిటి?" ప్రశ్నించింది కాణవి.

"ఇదిగో ఇలా నిద్రనాపుకుంటూ నీ యుద్ధ ప్రకటన వినడం" అన్నాడు కేశవసనుడు.

అష్టకుడు నవ్వాడు. అందరి మాటలు శ్రద్ధగా వింటున్నాడు శంకు. మధ్య మధ్యలో కునికిపాట్లు పడుతున్నాడు.

చల్లగాలి కోసం అష్టకుడు బయటకు నడిచాడు. కాణవి కూడా వచ్చింది. ఆకాశం నిర్మలంగా ఉంది. ఇంటి బయట ఉన్న కాగడాల

వెలుతురులో ఇరుప్రక్కల ఉన్న చెట్ల నీడలు ఒకదాని కొకటి పెనవేసుకుంటూ విడిపోతూ ఉన్నాయి.

కాణవి అతడితో ఏదో చెప్పాలని ఉద్యుక్తు రాలవుతుండగా జాబాలి దూరం నుంచి వస్తూ కనిపించాడు. అష్టకుడిని చూస్తూనే ఆలింగనం చేసుకున్నాడు. కాణవి శిరస్సును ఆఘ్రాణించి కుశల ప్రశ్నలు వేసాడు. అపుడే బయటకు వచ్చిన కేశవసనుడి భుజం చుట్టూ చేయి వేసి అతనికి అప్పగించిన పని గురించి మాట్లాడాడు. అంతా కలిసి మళ్ళీ ఇంటి లోనికి వెళ్ళారు.

వారిని తన కక్ష్యలో కూర్చోబెట్టి లోపలికి వెళ్ళి కొద్ది సేపటి తరువాత శుభ్రపడి తిరిగి వచ్చాడు. అందరూ కలిసి భోజనాలు చేసారు. భోజనాంతరము కాణవి కేశవసనుడు, శంకు వారి వారి గదుల్లో నిద్రకుపక్రమించారు.

జాబాలి అష్టకుడితో మాట్లాడుతూ కూర్చున్నాడు. జాబాలి వంక దీక్షగా చూస్తూ ఆలోచిస్తున్నాడు అష్టకుడు.

'అయోధ్య లోని రాచసభలో జాబాలి ఉండడం నిజంగా విశేషమే. అది దశరథుని ఔదార్యం. మరొక కారణం కూడా ఉంది. పదార్థ వాదులలో జాబాలికి మంచి పేరు ఉంది. అనుయాయుల సంఖ్య గణనీయంగా ఉంది. అధికారంతో మందబలంతో జాబాలి వాదాన్ని పక్కకు నెట్టివేయవచ్చుగాని, అతన్ని ఉపేక్షించడం అనర్థదాయకమని సుమంత్రుడి అభిప్రాయం. జాబాలి వంటి వాడు అధికార చట్రంలో ఉండడం ఉభయులకు మంచిదేనన్న సుమంత్రుడి సూచన వల్ల అతడు కొనసాగగల్గుతున్నాడు. జాబాలికి అదొక అవకాశం కూడా.

గతంలో ఉన్న గణతంత్ర వ్యవస్థలో అన్ని భావజాలాలకు ఆస్కారం

ఉండేది. కాని ఈ ప్రస్తుత రాచరిక వ్యవస్థలో వైదిక కర్మకాండను నిరసించే వారిపై హింస క్రమక్రమంగా పెరుగుతున్నది. కొంతమందినైన కాపాడుకోవాలంటే రాచరిక అండ అవసరం అని తెలుసుకున్నాక జాబాలి అతని భావజాలం నుండి పక్కకు తప్పుకోకుండానే కొంత రాజీపడి రాచసభలో కొనసాగుతున్నాడు. తాను కూడా కొన్నిసార్లు జాబాలి పలుకుబడి వల్ల ప్రమాదాల నుండి బయటపడ్డాడు'.

ఆలోచనల్లోంచి బయటకు వచ్చిన అష్టకుడు తనకు తెలిసిన విషయాలను, తన అనుమానాలను జాబాలి ముందు పెట్టాడు. జాబాలి నేరుగా ఏ విషయాలను నిర్దుష్టంగా చెప్పనప్పటికి అష్టకుడు సేకరించిన సమాచారంలోని వాస్తవాలను నిర్ధారించాడు.

"ఇప్పటివరకు సిద్ధాశ్రమ భూములు దుర్భేధ్యంగా ఉన్నాయని భావించి కన్నెత్తే వారు కాదు కదా. పరిస్థితిలో ఎలా మార్పు వచ్చింది" అడిగాడు అష్టకుడు.

"ఒకప్పుడు తాటక చాలా తెగల్ని సమన్వయం చేయగలిగింది. ఇప్పుడు ఆమె శతాధిక వృద్ధురాలు. తెగలన్ని విడివిడి అస్తిత్వాలతో ఉంటున్నాయి. కొత్తగా ఏర్పడుతున్న వ్యాపార మార్గాలను ఆర్య నాయకత్వం అనుకూలంగ మార్చుకుంటున్నది. అదీ కాకుండా విశ్వామిత్రుని వ్యూహం విభిన్నమైనది" అన్నాడు జాబాలి.

మళ్ళీ జాబాలి తానే అన్నాడు.

"నిజంగా నీది ఊహే కావచ్చు. ఎవరికీ ఏ ప్రమాదము లేక పోవచ్చు. తాటక ఉన్నంతకాలం సిద్ధాశ్రమాన్ని ఎవరూ ఏమి చేయలేరు".

చివ్వున తలెత్తి చూశాడు అష్టకుడు. అతడికి ఏదో అర్థం అవుతూ ఉన్నట్లనిపించింది. చాలాసేపు దీర్ఘాలోచనలో ఉండిపోయాడు.

“మీరు ఆపలేరా” దీనంగా అడిగాడు అష్టకుడు

“అష్టకా వైద్యుడిగా నీకు చాలా తెలుసు. ఏమి జరగుకుండ ఏదో కీడు జరగబోతుందనే ఆందోళనలతోనే రోగాల్ని ద్విగుణీకృతం చేసుకుం టారు ఈ మనుష్యులు అని నువ్వే నాతో చాలా సార్లు అన్నావు. మరొక విషయం నాకైతే దేవుడంటూ ఎవరూ లేరు. ఆచారాలు లేవు. కర్మకాండ చేయను. దర్పంగా కిరీటం పెట్టుకొని ఆయుధం ధరించిన దేవుడయినా, గుడ్లురుముతూ ఉన్న దేవతయినా... ఒక్కటే! అన్నీ మానవుల్ని మభ్యపెట్టేవే. ఏదో ఒక కర్మకాండను ప్రచారం చేసేవే” అన్నాడు జాబాలి.

అష్టకుడేమి మాట్లాడలేదు. జాబాలి తనలో తాను గొణుక్కుంటున్న ట్లుగా “నా శక్తి చాలా పరిమితమైనది. చాలా పొద్దుపోయింది. తెల్లవారాక మాట్లాడుకుందాం” అంటూ జాబాలి లోపలికి వెళ్ళిపోయాడు. కొద్దిసేపు ఆలోచన మగ్నుడయ్యాడు అష్టకుడు. ఒక స్థిర నిర్ణయానికి వచ్చాడు. శంకు, కాణవి కేశవసనులను నిద్రలేపి సిద్ధాశ్రమానికి వెళ్లానుకుంటున్న తన స్థిర నిర్ణయాన్ని చెప్పాడు అష్టకుడు.

వాళ్లని తిరుగు ప్రయాణం కమ్మని చెప్పాడు. కాని వారు ముగ్గురు వినలేదు. అయోధ్య నగరం మేల్కొనే కంటే ముందే నలుగురు కలిసి సరయు దాటారు.

***

## -16-

రామ, లక్ష్మణ, విశ్వామిత్రులు నడుస్తున్నారు. చిక్కటి అడవి. ఆగి ఆగి వినిపిస్తున్న జంతువుల అరుపులు, వింత వింత పక్షులు ధ్వనులు. విశ్వామిత్రుడి మనసు ఆందోళనగాను, ఆత్రంగాను ఉంది. ఎంత వద్దనుకున్నా ఏదో ఒక సందేహం మాత్రం అతడిని వదలడం లేదు.

'రాముడు ఈ పని చేయగలడా, తన ఆదేశాల్ని పాటించగలడా' విశ్వామిత్రున్ని వేధిస్తున్న సందేహమది.

'రామలక్ష్మణుల లాంటి రాచబిడ్డలు ధర్మం కోసం కఠినంగా ఉండడం లోని రుచి చూడడం ప్రారంభిస్తే చాలు... ఇక వాళ్ళని ఆపడం కష్టం. బాలురు, స్త్రీలు, వృద్ధులు, అవిటి వాళ్ళనే కనికరం లేకుండా కత్తి ఎత్తి పట్టి కుత్తుకలు తెంచేవాడే ఈ అడవుల్ని విముక్తం చేయగలడు. రాముడిలో అలాంటి లక్షణం ఉంటే తన ఆయుధ సంపత్తి సమస్తం నిపుణులతో సహా రాముడి ధారాదత్తం చేస్తాడు. లేకపోతే వెనక్కి వెళతాడు'.

కొంత దూరం నడిచాక ఆగాడు. తన అనుచరగణం చెప్పిన

ఆనవాళ్ళు గుర్తుచేసుకున్నాడు. ఇంకా కొంత దూరం నడవాలి అనుకున్నాడు. కొద్దిసేపు నడిచారో లేదో దూరంగా కొన్ని గుడిశెలు కనిపించాయి. చుట్టూ పరికించి చూసాడు. తన అనుచర గణం తమకు సమీపంలో రహస్యంగా, వ్యూహాత్మకంగా తమను ఆవరించి ఉందన్న నమ్మకం కలిగి స్థిమిత పడ్డాడు. విచిత్రమైన కూత వినిపించింది. అదొక సంకేతం. ప్రతిగా చేతిలోని దండాన్ని ఎత్తి పట్టుకొని మళ్ళీ కిందకు దించాడు.

రామలక్ష్మణుల వైపు చూశాడు. రాముడి ఆలోచనలను పసిగట్టడం కష్టం. లక్ష్మణుడు మాత్రం నిండు ఉత్సాహంతో ఉన్నాడు.

"రామా ఇదే తాటక వనం. అదే తాటక నివాసం" అన్నాడు విశ్వామిత్రుడు సాధ్యమయినంతగా కలవరాన్ని కప్పిపెట్టుకుంటూ.

లక్ష్మణుడు ఉలిక్కిపడ్డాడు. 'తాము వెళ్ళాల్సింది సిద్ధాశ్రమానికి. విశ్వామిత్రుడు ఇక్కడకు తీసుక వచ్చాడేమిటి? ఎక్కడా దారితప్పకుండా, సూటిగా, నేరుగా తాటక నివాసం వద్దకు తీసుకవచ్చాడు ఎందుకు?' రాముడి వైపు చూశాడు. సోదరుడిలో ఏ భావము కనపడలేదు.

"రామలక్ష్మణులారా తాటకను రెచ్చగొట్టండి. చీకాకు పెట్టండి" అన్నాడు విశ్వామిత్రుడు.

రామలక్ష్మణుల్ని బాల్య చాపల్యం ఆవహించింది. ఆటలాగా తోచింది. వింటినారిలను లాగుతూ శబ్దాలు చేసారు. గట్టిగా కేకలు వేసారు. అప్పటి వరకు నిశ్శబ్దంగ ఉన్న ఆ ప్రాంతం వీళ్ళ అరుపులు, కేకలతో నిండిపోయింది.

తన గుడిశెలో విశ్రాంతి తీసుకుంటున్న తాటక ఆ శబ్దాలు విని దిగ్గున లేచి కూర్చుంది. ఏమి అర్థం కాలేదు. కఱ్ఱను ఊతంగా చేసుకొని

గుడిశె బయటకు వచ్చింది. శబ్దాలు వస్తున్న వైపు దృష్టి సారించింది. దూరంగా పొడుగాటి విల్లులు, ఒరలో కత్తులు ధరించి ఉన్న ఇద్దరు బాలురతో ఆర్యముని ఒకడు కనిపించాడు.

ఆయుధ దారులైన ఆ ఇద్దరి పిల్లను చూసి ఆశ్చర్యపడింది. దగ్గరగా నడిచి వచ్చింది.ఆమె వెనుక వృద్ధులైన ఆశ్రమవాసులు ఒక అయిదారు గురు ఉన్నారు.

గుడిశెలోంచి బయటకు వస్తున్న ఆ వృద్ధురాలిని చూసి అరవడం ఆపారు రామలక్ష్మణులు.

“తాటక” అన్నాడు విశ్వామిత్రుడు హెచ్చరిస్తున్న గొంతుతో.

“ఎంత భయంకరంగా ఉంది కదా. అకస్మాత్తుగా చూస్తే జడుసుక చస్తారు జనం” అన్నాడు రాముడు.

లక్ష్మణుడు ఆసక్తిగా ఆమెనే చూస్తున్నాడు. ‘ముడతలు పడిన ముఖం నిండా లోతైన గాయాల గుర్తులు. ఆకారం కోల్పోయిన ముక్కు. చీలిన పెదవి నిజంగా తాటక వికారంగా భీతి గొలిపే దానిలా ఉంది. తాటక అంటే ఇంత వృద్ధురాలని ఏనాడు అనుకోలేదు. గంగా తీరంలో తాటక అంటే ఒక యోధ. రకరకాల ఆకారాలు మార్చుకుంటూ తిరిగే ఒక రాక్షసి.

బహుశా ఎన్నటికి వయసు మళ్ళని రాక్షసి తన మాయాశక్తులతో ముసలిదానిలాగా వచ్చిందేమో? అయినా తమకు తాటకతో ఏం పని. తాటక వనానికి వెళతామని విశ్వామిత్రుడు దశరథుని సభలో చెప్ప లేదే?

తాటక ఆ ముగ్గురిని చూస్తూ

“పిల్లలూ ఏమిటీ అల్లరి? ఏమయ్యా పెద్దమనిషి ఈ పిల్లలేమిటి....

యుద్ధానికి వచ్చినట్లు ఈ ఆయుధాలేమిటి? ఇది తాటకవనం. పరాయి వాళ్ళు అనుమతి లేకుండా, అందునా ఆయుధాలతో సంచరించడం నిషేధం. తెలియకుండా ఇటు వచ్చినట్టున్నారు. వచ్చిన దారినే వెళ్లిపొండి" అంది. మామూలుగా చెప్తున్నట్లు అనిపించినా ఆమె గొంతులోని కఠినత్వం తెలియవస్తూనే ఉంది.

'ఆమె శరీరానికే వార్ధక్యం కాని గొంతుకు రాలేదు' అనుకున్నాడు లక్ష్మణుడు.

'ఇదేమిటి తాటక ఇలా చెప్తోంది? కనీ కనపడగానే మీదపడి గోళ్ళతో రక్కి విరుచుక పడి తినేయడానికి వస్తుందని భయపడుతూ ఒక చేతిని కత్తిపిడి మీద వేసి తమ జాగ్రత్తలో తాముంటే ఇంత సాధారణంగా మాట్లాడుతుందేమిటి' ఆశ్చర్యపోయాడు లక్ష్మణుడు.

"నాయనాలారా తిరిగి వెళ్ళండి. మీరు ఎక్కడకు వెళ్లాలన్న మా వాళ్లు తోడువస్తారు. క్షేమంగా దిగబెడతారు. ఇవి మాచే రక్షింపబడుతున్న భూములు. మీ పలుకులో చెప్పాలంటే రాక్షస భూములు. వెళ్లిపొండి ఇక్కడ నుండి" అంటూనే వెనక్కి తిరిగింది తాటక.

విశ్వామిత్రుడు పరిసరాల్ని నిశితంగా పరిశీలిస్తున్నాడు. తాటక సంబంధీకుల బలగాలు అక్కడ ఏవి ప్రస్తుతానికి లేవని నిర్ధారించు కున్నాడు. ఆమె మాట్లాడుతున్నపుడు సంకేత శబ్దం వినిపించింది. పరిస్థితి తమ ఆధీనంలో, తమకు అనుకూలంగా ఉందని అర్థం.

నిజానికి తాటక వనంలో చెప్పుకోదగ్గ సంఖ్యలోనే బలగం ఉం టుంది. అయితే కొద్ది రోజుల క్రితమే సిద్ధాశ్రమం ఆవల నదీ తీరాన జరుగనున్న ఉత్సవానికి వెళ్ళారు నాగులు. అది వారి సాంప్రదాయం. తిరిగి రావడానికి ఎంత కాదన్నా పక్షం రోజులు పడుతుంది. ఇవన్నీ

సేకరించుకుని, గణించుకునే ముహూర్తం నిర్ణయించాడు విశ్వామిత్రుడు.

"రామా హతమార్చు తాటకను" స్థిరమైన గొంతుతో చెప్పాడు విశ్వామిత్రుడు ఒక్కో మాటనే నొక్కి పలుకుతూ.

ఆ మాట చెవిన పడగానే తన నివాసం వైపు వెళుతున్న తాటక గిర్రున వెనక్కి తిరిగి విశ్వామిత్రుడికి వంక చురచుర చూసింది. ఆమె చూపులు కాఠిన్యతను సంతకరించుకున్నాయి. కర్రపై చేతులు బిగుసుకున్నాయి.

"ఓహో మరొక అగస్త్యుడివా" అడిగింది తాటక. కర్కశత్వం నిండిన గొంతుతో తిరిగి అంది.

"ఏమి గురువు నువ్వు? ఆటలాడుకునే పిల్లలకు హత్యలు చేయడం నేర్పుతావా. క్రూర జంతువులనైనా సరే దాడి చేసినపుడు మాత్రమే చంపాలే. ఆహారం అవసరమైతే తప్ప సాధు జంతువుల్ని చంపకూడదు కదా. ఇంక మనుషుల్నంటావా... ఆత్మరక్షణ కోసం మినహా ఎప్పుడూ గాయపరచకూడదు. ఇది మా నీతి, మతం. మరి నీ నీతి, రీతి ఏమిటి" అని నిలదీస్తున్నట్లుగా అంది.

రామ లక్ష్మణుల వైపు చూస్తు తాటక

"మీరిద్దరు చూడముచ్చటగా ఉన్నారు. అలసట కలిగితే ఆయుధాలు విసర్జించి కాసేపు విశ్రమించి వెళ్ళండి" అంది అనునయంగా.

"రాక్షసి! నీ మాయలు ఈ విశ్వామిత్రుడి దగ్గరనా? రామా, చంపు ఈ రాక్షసిని" ఆదేశిస్తున్నట్లుగా అన్నాడు విశ్వామిత్రుడు.

అతడి వీరంగం చూసి చిర్రెత్తుకొచ్చింది తాటకకు.

"విశ్వామిత్రుడా నీ పేరు. నన్నెందుకు చంపమంటున్నావో చెప్పు" రౌద్రంగా అడిగింది.

"నువు రాక్షసివి" అన్నాడు విశ్వామిత్రుడు.

"అయితే ఏమిటి? పరాయి వాళ్ళయిన ప్రతి ఒక్కరిని రాక్షసి అనో అసురుడు అనో మీరే గదా పిలిచేది" తడబడకుండా అరుస్తూ చెప్పింది తాటక.

"మలద కరూశాల్ని ధ్వంసం చేశావు. అగస్త్యుడిని బాధించావు. ఈ వనంలో ఇతరుల ప్రవేశం నిషేధించావు. ఇక్కడ హోమాగ్ని వెలగనీయడం లేదు" అన్నాడు విశ్వామిత్రుడు అంతే కోపంతో.

తాటక ఆవేశంతో ఊగిపోయింది. పాత గాయమేదో తిరిగి రేగింది.

"అగస్త్యుడిని బాధించడమా? దొరికితే కసితీరా చంపేదాన్ని. నా మొగుడిని అగస్త్యుడు హతమారిస్తే మీ ఆర్య విధవ స్త్రీల లాగా కుములుతూ ప్రాణత్యాగం చేయాలా? అట్లాంటి నిరర్థక చావు మా తెగల్లో ఏ ఆడది చేయదు. మొగుడిని చంపితే చేతులు ముడుచుకు కూర్చోవాలా? ఇప్పటికైనా సరే వాడు దొరికితే నా చేతులతోనే స్వయంగా చంపుతాను. ఇక ఇక్కడ మీ రాకపోకలకి నిషేధం అంటావా? మీ పురాలలో మమ్మల్ని మాత్రం దాసులుగా కాకుండా యధేచ్ఛగా తిరగనిస్తారా? హోమాగ్ని సంగతా, మీ పురాలలో మా తల్లిదేవతల పూజలు చేయనిస్తారా?" అంటూ కోపం నిండిన స్వరంతో ప్రశ్నలు సంధించింది.

"మాతో నీకు పోలికేమిటి. మా రాకపోకలకు నీ అనుమతి లేమిటి. ఈ భూమండలమంతా పితామహుడు మాకు ప్రసాదించాడు" అన్నాడు విశ్వామిత్రుడు.

అతడికి ఈ వాదన ఇష్టం లేదు. కాని అనుకోకుండానే మాటకు మాట పెరిగిపోతూ ఉంది.

"అయితే ఆ పితామహుడినే వచ్చి అదే విషయం మాకు చెప్పమను

చూద్దాం” వెటకారంగా అంది తాటక.

“నువ్వు నరమాంస భక్షిణివి” ఆరోపిస్తూ అన్నాడు.

“అవునా?! ఎవర్నెవరిని తిన్నానో చెప్పు. నేను నరమాంస భక్షిణినే అయితే, నానా చెత్త మాట్లాడుతున్న నీవు ఇప్పటి కెప్పుడో నా పంటి కిందికి వచ్చేవాడివి కాదా?” అంది హేళనగా.

విశ్వామిత్రుడికి దిక్కు తోచలేదు. అసహనం రెట్టింపయింది.

“నీతో వాదనలేమిటి? రామా, చంపు దీన్ని” తీవ్ర స్వరంతో ఆదేశిస్తూ అన్నాడు.

నిజానికి రామలక్ష్మణులకు కొంత గందరగోళంగా ఉంది. ముసలి మనిషి, పైగా ఆడది. రాముడికి సంకోచం కలిగింది.

“స్త్రీని, అందునా వృద్ధురాలిని ఎలా చంపేది” సంశయంగా అడిగాడు రాముడు.

రాముడు డోలాయమానంలో పడ్డాడని గ్రహించాడు విశ్వా మిత్రుడు. ఇది కీలకమైన సమయం. అందరి భవిష్యత్తు దీనితో ముడిపడి ఉంది.

“ధర్మ విరుద్ధంగా నడిస్తే స్త్రీలనైనా సరే హతమార్చవచ్చని సాంప్రదాయం చెపుతోంది. గతంలో విరోచనుడి కూతురైన మంథరను ఇంద్రుడు చంపలేదా? శుక్రాచార్యుని తల్లియైన ఉశన శిరస్సును విష్ణువు ఖండించ లేదా? ఇక ఉపేక్షించకు దీన్ని వధించు రామా” ఆజ్ఞాపిస్తున్నట్లుగా అన్నాడు విశ్వామిత్రుడు స్థిరమైన గొంతుతో.

ఇక విచక్షణకు తావు లేదు.

“మా తండ్రి చెప్పిన విధంగా మీ మాటే మాకు శిరోధార్యం. మీ ఆజ్ఞను పాటించడమే మా పరమ కర్తవ్యం” రాముడు విల్లును ఎక్కు

పెట్టాడు. అప్పటికే లక్ష్మణుడు కత్తి దూసి సిద్ధంగా ఉన్నాడు.

"పిల్లలను ఉసిగొల్పు తావెందుకురా? నువ్వు రా. నా వీరత్వమేమిటో చూపిస్తాను" ఉరిమే గొంతుతో అంటూ తాటక విశ్వామిత్రుడు వైపు కర్రను విసురుతూ వేగంగా రాసాగింది.

ప్రతిగా విశ్వామిత్రుడు చేతిలో దండాన్ని పైకెత్తి హుంకారించాడు.

రాముడు బాణం ఎక్కుపెట్టి సంధించాడు. అది ఆమె కుడి భుజంలో సూటిగా నాటింది. నొప్పితో అరుస్తూ చేతిలోని కర్రను వదిలేసింది. కిందికి వంగి ఎడమ చేత్తో నేలమీది మట్టిని తీసి అరుస్తూ, తిడుతూ వారిమీదికి విసరసాగింది. దొరికిన రాళ్ళను దొరికినట్లు వాళ్ళవైపు విసరసాగింది. ఆమె వెనుక ఉన్న సహచరులు కూడా అరుస్తూ మట్టిని రాళ్ళను విసరేయసాగారు. రామలక్ష్మణవిశ్వామిత్రుల ఎదురుగా దుమ్మురేగింది. కళ్ళలో పడసాగింది. రాళ్ళు కూడా పడుతున్నాయి. దెబ్బలు తగులుతున్నాయి.

"రామా, ఇక ఉపేక్షించకు. ఇంకా కొంత సమయం గడిచి చీకటి పడితే వాళ్ళదే పైచేయి అవుతుంది. హతమార్చు తాటకిని" అన్నాడు విశ్వామిత్రుడు.

అన్నదమ్ములిద్దరిలో యుద్ధోన్మాదం కమ్ముకుంది. ఆవేశం, కసి నరనరాన పాకింది.

రాముడు విల్లును ఎడమ చేతిలోనికి తీసుకుని కుడిచేత్తో కత్తి దూసి పట్టుకున్నాడు. కత్తులు దూసిన సోదరులిద్దరు తాటక వైపు దూసుకెళ్ళారు.

ఖడ్గాలు దూసి తన మీదికి ఉరుకుతూ వస్తున్న బాలురను చూసి విభ్రాంతి పొందింది. నొప్పిని ఓర్చుకుంటూ ఎడమ చేతితో కర్రను

తీసుకొని వాళ్లని కొట్టసాగింది. రాముడు కత్తితో తాటక ఎడమ చేతిని ఖండించాడు. గావు కేక పెట్టింది తాటక. రక్తం బుసబుసమని పొంగింది. లక్ష్మణుడు తాటక చుట్టూ కత్తితో చిందులు వేస్తూ ఆమె సహచరుల్ని దగ్గరకు రానివ్వడం లేదు.

బాణం దెబ్బతో నిర్జీవంగా ఉన్న తాటక కుడి చేతిని సైతం ఖండించాడు రాముడు. తాటక కేకలతో దద్దరిల్లింది ఆ ప్రాంతం.

మొదటిసారి రక్తం పారిస్తున్న రాముడిని చూసి లక్ష్మణుడు ఎంత ఉత్తేజితుడయ్యాడంటే, పరుగు పరుగున వచ్చి తాటక ముక్కు చెవుల్ని పరపర కోసేశాడు.

తాటక అరుపులు రెట్టింపయ్యాయి. కూలబడకుండా ఉండడానికి విశ్వ ప్రయత్నం చేస్తూ కాళ్ళతో వాళ్ళను తన్నడం ప్రారంభించింది.

తాటక అత్యంత సమీపంలో ఉన్నప్పటికి రాముడు కత్తి పడేసి విల్లు ఎక్కుపెట్టి వరుసగా బాణాల్ని ఆమె శరీరం లోకి సంధించాడు.

కుప్పకూలి ప్రాణాలు వదిలింది తాటక. చిత్రవధ చేసి తాటకను చంపుతున్న తీరును చూసి ఆమె సహచరులు భయంతో, పారిపోవడానికి కూడా శక్తి లేకుండా మట్టిలో పడి పొర్లుతూ, ఏడుస్తూ, అరుస్తూ మట్టిని ఎగజిమ్మసాగారు.

రామలక్ష్మణులు ఎవరినీ వదలలేదు. కొంత సేపటి తరువాత నిశ్శబ్దం అలుముకుంది అక్కడ.

రామలక్ష్మణులు తాటకను చంపుతున్న తీరును చూసి విశ్వామిత్రుడు సైతం కంపించాడు. ఉద్వేగం పొందాడు. చివరకు సంతోషం అతడిని నిలువెల్లా ఆవహించింది.

రామలక్ష్మణులు శాంతించారు. విశ్వామిత్రుడు రాముడిని

ప్రశంసలతో ముంచెత్తాడు. అతడి ఆనందానికి అవధులు లేవు.

రామలక్ష్మణులు తమ చేతుల్ని చూసుకున్నారు. ఒకరివైపు ఒకరు చూసుకున్నారు. రక్తం తడిసిన హస్తాలు... ఒంటి నిండా నెత్తుటి మరకలు.

రాముడు తాటక శవం వైపు చూశాడు. తన జీవితంలో మొట్ట మొదటిసారి, స్వహస్తాలతో ఒకరిని చంపాడు. తాను చంపింది ఎవరిని? ఒక ముసలి యక్షిణినా? రాక్షసినా? క్రూర కర్మురాలినా? ధర్మ విరోధినా?... ఎవరిని హతమార్చాడు? ఆలోచనలతో సతమతమవు తున్నాడు రాముడు. మనిషి పచ్చి నెత్తుటి వాసన కడుపులో తిప్పుతున్నట్లుగా ఉంది.

ఆగకుండా వినవస్తున్న విశ్వామిత్రుడి ప్రశంసా వాక్యాలు అతడికి స్వాంతన చేకూర్చాయి.

'అవును తాను ఒక ధర్మ విరోధిని హతమార్చాడు. ఆర్యపుత్రుడిగా తన కర్తవ్యాన్ని తాను నిర్వర్తించాడు అంతే' అనుకున్నాడు.

అవయవాలు తెగి రక్తపు మడుగులో పడి ఉన్న తాటక శవాన్ని లక్ష్మణుడు చూస్తూ ఉన్నాడు. 'నిజంగా ఈమెకే గనక రాక్షస మాయలు వచ్చి ఉంటే మా చేతుల్లో కుక్క చావు చస్తుందా? రాముడు బాణం వేసేటప్పుడే మాయం కావలసింది. చేతుల్ని ఖండిస్తున్నప్పుడైనా, ముక్కు చెవుల్ని కోస్తున్నప్పుడైనా అదృశ్యమై పోవలసింది కదా? కనీసం శరీరం పెంచి లేదా తగ్గించి తప్పించుకోవచ్చు. ఇంకా ఏదైనా భీకర రూపం దాల్చి మా మీద దాడి చేయవచ్చు. మరి ఎందుకలా జరగలేదు. రాక్షస మాయలు, మంత్రాలు  వట్టి మాటలు. ఉంటే గింటే భుజబలం, బుద్ధి బలం, కొంత అదృష్టం అంతే' అనుకున్నాడు లక్ష్మణుడు.

రామలక్ష్మణులు నెత్తురు తడిసిన తమ చేతులతో విశ్వామిత్రుడికి పాదాభివందనం చేశారు.

విశ్వామిత్రుడు ప్రేమతో రాముని శిరమును మూర్కొనెను. ముగ్గురు కలిసి దగ్గరలో ఉన్న నది వద్దకు వెళ్ళి స్నానం చేశారు. ఆ రాత్రి అక్కడే శయనించారు.

***

## -17-

ప్రాతఃకాలమున విశ్వామిత్రుడు రామలక్ష్మణులను మేల్కొలిపాడు. ముగ్గురు స్నానాధికాలు పూర్తి చేసుకున్నారు. ఉత్తరం అభిముఖంగా తాను కూర్చొని రాముడిని తూర్పు అభిముఖంగా కూర్చోబెట్టాడు. కొంత దూరంలో లక్ష్మణుడు కూర్చొన్నాడు.

రాముని వైపు చూశాడు. అతడికి సంతృప్తిగా ఉంది. తన అంచనా లు నిలబెట్టాడు. ఇక తన అస్త్ర జ్ఞానాన్ని అతడికి ప్రసాదించవచ్చు. పూర్తి స్థాయి శిక్షణ ఇవ్వవచ్చు. తన ఆధీనంలోని ప్రతి ఆయుధాన్ని, ప్రతి ఒక్క నిపుణుడిని అతడి పరం చేయవచ్చు. ఇలా అన్నాడు –

"సర్వశ్రేష్టుడైన రామా, తాటకను వధించి దేవతలకు, గోబ్రాహ్మణు లకు ప్రీతి కలిగించావు. సమస్త లోకాలు నిన్ను ప్రశంసిస్తున్నాయి. నేను మిక్కిలి సంతుష్టడనైనాను. ఇక నా ఆధీనం లోని వివిధములైన అస్త్రాలను నీకు పరమ ప్రీతితో ఇస్తాను. వీటన్నింటిని భృశాశ్వ తనయులు నా పరం చేసి ఉన్నారు. ఇవన్నీ నీ ఆధీనంలో ఉంటే అసురులు, గంధర్వులు, నాగులు... కడకు దేవతలు సైతం నిన్ను ఎదిరించలేరు గ్రహించు రామా" అంటూ తన చేతిలోని దండంతో సంకేతం ఇచ్చాడు విశ్వామిత్రుడు.

చెట్ల బాట నుండి మెల్ల మెల్లగా ఒక్కో వ్యక్తి చేతిలో వింత వింత

ఆయుధాలతో రాసాగారు. అందులో రకరకాల వ్యక్తులున్నారు. విభిన్న ప్రాంతాల మనుషులు. ఒకరిద్దరు అసుర లక్షణాలు ఉన్న వ్యక్తుల్ని చూసి ఆశ్చర్యపడ్డాడు లక్ష్మణుడు.

ఒక్కో వ్యక్తి వచ్చి మొదట విశ్వామిత్రుడికి భక్తి పూర్వకంగా నమస్కరించి, రాముడి వైపు తిరిగి వినయంగా నమస్కరించి తన చేతుల్లోని ఆయుధాన్ని చూపుతూ విశ్వామిత్రుడు దాని పేరు చెప్పగానే వారు వివరించసాగారు. సావధానంగా విని, స్వీకరిస్తున్నట్లుగా రాముడు ఆయుధం పైన చేయి ఉంచగానే, తలను మరింత కిందికి వంచి 'త్రికరణ శుద్ధిగా అతడి సేవకులుగా ఉంటామని చెప్తూ' నిష్క్రమిస్తున్నారు.

విశ్వామిత్రుడు ఒక్కో ఆయుధాన్ని పరిచయం చేశాడు.

"దండ, ధర్మ, కాల చక్రాలు, తీక్షమైన విష్ణుచక్రము, ఇంద్రాస్త్రములు, వజ్రాస్త్రములు ఇవి. శివ సంబంధమైన మహాశూలం, మహాస్త్రాన్ని, బ్రహ్మ సంబంధిత బ్రహ్మాస్త్రాన్ని అందిస్తున్నాను. మీ ఇరువురికి దివ్యమైన మోదకి, శిఖరి అనే గదలను ప్రసాదిస్తున్నాను. కాలపాశాన్ని, శక్తి సంపన్నమైన వారుణాస్త్రాన్ని నారాయణాస్త్రాన్ని గ్రహించు రాజకుమారా!

ప్రధనము అను పేరు గల వాయువ్యాస్త్రమును, హయ శిరస్సు, అస్త్రాన్ని, క్రౌంచాస్త్రమును, విష్ణు శక్తి, శివశక్తి అనే శక్తి ధ్వయాన్ని గ్రహించు.

ఇదిగో ఇవి రాక్షసులు ధరించే భయంకరమైన కంకాళము, ముసల ము, కాపాలము, కంకణము అవే అస్త్రాలు. ఇతడు విద్యాధరుడు. వీరు ప్రయోగించే నందనమనే మహాస్త్రాన్ని, అత్యంత నాణ్యత కలిగిన ఖడ్గ రాజానిన నీ పరం చేస్తున్నాను. గాంధార ప్రాంతంలో యోధులకు ప్రియమైన మానవాస్త్రం ఇది. ఇందులో నూరుగరినైనా సరే మైకంలోకి

నెట్టేసేవి, చీకాకు పుట్టించగలవి ఉన్నాయి. సౌరాస్త్రమును తీసుకో.

రామా! మన్మథునికి ఇష్టమైన 'మదనము' అనే అస్త్రాన్ని, పైశచ ప్రాంతాలు ప్రియంగా వాడే 'మోహన' అస్త్రాన్ని గైకొనుము. ఇంకా కళ్ళు మిరుమిట్లు గొలిపేటట్లు చేసి శత్రు పరాక్రమాన్ని నిర్వీర్యం చేసే తేజ:ప్రభ అస్త్రాన్ని స్వీకరించు. సోమ దేవత యొక్క శిశిరమును, విశ్వకర్మ నిర్మితమైన సుదారుణస్త్రమును, భగదేవత యొక్క దారుణాస్త్రము, మనువుకు చెందిన శీతేషువును గ్రహింపుము..." సకల ఆయుధాల్ని రాముడి పరం చేశాడు.

అందులో కొన్ని ఎంత కఠినమైన దానినైనా చీల్చగలిగేవి, పొగలు చిమ్మేవి, శత్రు సమూహాల్ని వివశత్వం లోకి నెట్టేసేవి, ఒకే వింటి నారితో ఎన్నో బాణపులు ములుకుల్ని ప్రయోగించ గలిగేవి, విచిత్ర యంత్రాకృతిలో ఉన్న పరికరాలు,నిప్పుని ప్రజ్వరిల్లంపజేసేవి... రకరకాల కత్తులు, బాణాలు, కొరడాలు, గదలు, విల్లూ బాణాలు... ఉన్నాయి.

"రామా, ఈ అస్త్రాల తయారీ, విశిష్టత, ప్రయోగించడం, ఒకవేళ శత్రువులు ఇట్లాంటి ఆయుధాలు ప్రయోగిస్తే వాటి ప్రభావాన్ని తగ్గించే ఆయుధాలు, పరికరాలు, మార్గాల గురించి నీకు శిక్షణ ఇస్తాను. ప్రస్తుతానికి వీటిని గ్రహించు" అన్నాడు విశ్వామిత్రుడు.

రాముడు గురువుకు నమస్కరించి, లేచి నిలబడి వారిని ఉద్దేశించి ఇలా అన్నాడు.

"మీరు నా స్మృతి పథమున మసలుచు కార్యావసరములందు నాకు సహాయపడండి" అన్నాడు. వారంతా రామునికి నమస్కరించి యథాస్థానాల్లోకి వెళ్ళారు.

***

రామలక్ష్మణ విశ్వామిత్రులు సిద్ధాశ్రమ సమీపంలోని సంకేత స్థలం వద్ద చేరారు. విశ్వామిత్రుడి శిష్య బృందం, అప్పటికే అక్కడ వేచి ఉన్న పిడికెడు మంది ముని కుమారులతో కలిసి హోమం ఏర్పాట్లు చేశారు.

హోమాగ్ని వెలిగింది. ముందూ వెనుక చూసుకోకుండా కొద్ది మంది అనుచరులతో వచ్చిన మారీచుడు సుబాహులతో దూరం నుండే తలపడ్డారు రామలక్ష్మణులు. వరుసగా బాణాలు సంధించారు రామలక్ష్మణులు.

రాముడికి తన కందిన కొత్త ఆయుధాల్ని పరీక్షించే అవకాశం చిక్కింది. ఆగ్నేయాస్త్రాన్ని అందుకుని ప్రయోగించాడు. అది సుబాహుని గుండెలో బలంగా నాటింది. ఒక్క దెబ్బకే సుబాహు గావుకేక పెడుతూ నేల కూలాడు. మారీచుడికి భుజంలో, డొక్కలో బాణాలు దిగాయి.

రాముడు శీతేషువును ప్రయోగించాడు. అవి వాసన వెదజల్లుతుంటే మైకం కమ్మసాగింది వాళ్ళకు. ప్రమాదం గ్రహించిన మారీచుని అనుచరులిద్దరు, అతడిని లాక్కుంటూ దూరంగా పారిపోయారు. మగతలోకి జారుకుంటున్న మారీచుడిని తీసుకుని పరుగు లంకించుకున్నారు. కొన్ని యోజనలు వెళ్ళాక గాని వారు ఆగలేదు.

రామలక్ష్మణుల బాణాల పరంపర హోమం వద్దకు వచ్చిన వారందరిని నేల కూల్చింది.

మానవ రక్తంతో తడిసింది హోమాగ్ని ప్రాంతం. రామలక్ష్మణులకు ఈసారి మనుషుల నెత్తుటి పచ్చి వాసన వికారం కలగించలేదు.

***

## -18-

అష్టకుడు తనవాళ్ళతో కలిసి బయలుదేరాడు. రాత్రుళ్ళు తప్ప మరే సమయంలోను విశ్రమించకుండా ప్రయాణించారు. మధ్యలో కనిపించిన చిన్న చిన్న ముని వాటికల వద్ద రాత్రుళ్ళు ఆగారు. విశ్వామిత్రుడి మార్గాన్ని కనుక్కోవడం పెద్ద కష్టం కాలేదు అష్టకుడికి. అతడు కీర్తి గడించిన వైద్యుడు కావడం, గతంలో మలద కరూశాల వాసిగా చెప్పుకోవడం లాభించింది.

అయితే అష్టకుడికి అర్థం కానిదల్లా సిద్ధాశ్రమానికని చెప్పి బయలు దేరి వెళ్లిన విశ్వామిత్రుని బృందం ఎందుకు తాటక వనానికి మళ్లింది? అదే విషయాన్ని శంకు అడిగాడు. అష్టకుడి ఆలోచనలు పరిపరి విధాలుగా సాగుతున్నాయి.

సాధారణంగా అడవిలో విసిరేనట్లుగా దూరదూరాల్లో అక్కడో పది మంది ఇక్కడో పదిమందిగా అటవీ జాతులు నివసిస్తాయి. యుద్ధమే ప్రకటిస్తే చాలా మట్టుకు అటవీ జాతులు సిద్ధాశ్రమ కేంద్రంగా ఏకమవు తాయి. తాటక మాట ఇప్పటికీ చెల్లుబాటు అవుతుంది.

ఎంతపెద్ద సైన్యమైన ఈ కీకారణ్యంలో తిష్ట వేసి దీర్ఘకాలం

పోరాడడం అసాధ్యం. అలవాటైన చిక్కటి అడవి, రాత్రుళ్ళు సైతం అత్యంత వేగంగా కదలగల అనుభవం అటవీ జాతుల సొంతం. గెలుపోటముల సంగతి ఎలా ఉన్న నిర్దుష్ట ఫలితాన్ని రాబట్టుకోగల యుద్ధం చేయడం సాధ్యమయ్యే పని కాదు.

బహశా అందుకేనేమో... యుద్ధ ప్రకటన లేదు. సైనిక సంచారం లేదు. నిశ్శబ్దంగా ఒక చిన్న పటాలం ప్రభావవంతమైన ఆయుధ సంపత్తితో అడవుల్లోకి చొచ్చుకొచ్చింది. అగస్త్యుడి తరువాత మళ్ళీ ఇదే ప్రయత్నం.

అష్టకుడికి స్పష్టత రాసాగింది. సిద్ధాశ్రమాన్ని కోలుకోలేని దెబ్బ తీయాలనుకుంటున్నారు. అదీ నిశ్శబ్దంగా.

మరి తాటక వనం సంగతి? అష్టకుడి ఒళ్ళు జలదరించింది. సమీప భవిష్యత్తులో యక్ష రాక్షసులు, నాగులు మళ్ళీ ఆధిపత్యం చలాయించకూడదు. అదే కదా విశ్వామిత్రుడి పథకం.

తాటక వనం సమీపస్తున్న కొద్ది అష్టకుడి మనసు కీడును శంకించసాగింది. తాటక వనవాసుల బృందం తమను అడ్డుకోలేదు. ఏమయింది? అందరినీ తుడిచి పెట్టేశారా?

ఆవాసాలు సమీపిస్తున్న కొద్దీ దుర్గంధం మొదలయింది. ముక్కులు మూసుకుని వెళ్ళారు. చెల్లా చెదురయిన మృతదేహాలు... చెట్టుకొ కటి పుట్టకొకటి కనిపిస్తున్నాయి. జంతువులు పీక్కుతినగా మిగిలిన శవాలవి. అతి కష్టం మీద తాటక మృతదేహాన్ని గుర్తించగలిగాడు.

మొహం చెక్కినట్లు ఉంది. గాయాలు కావచ్చు. లేదా జంతువులు పీక్కు తిని ఉండవచ్చు. రెడు చేతుల్ని ఖండించిన ఆనవాళ్ళున్నాయి. గుండెలో దిగిన బాణాలు........ ఆమె చావు ఎంత హృదయ విదారకంగా

ఉందో వైద్యుడయిన అష్టకుడికి బాగా బోధపడింది.

ఒకవైపు దు:ఖం. ఇంకోవైపు కడుపులో తిప్పుతున్న దుర్గంధం. అందరూ కలిసి అతి కష్టం మీద ఆ శవాలన్నింటిని ఒకే గోతిలో పూడ్చారు.

కాణవి, కేశవసనులు అవతలకి నడిచి వాంతి చేసుకున్నారు. సమీపంలో ఉన్న నది వద్దకు వెళ్లి స్నానం చేశారు. నదిలోకి దిగుతుండగా ఒడ్డుపైన, రాళ్ళపైన ఉన్న రక్తపు మరకల్ని చూశారు. అష్టకుడికి బాధ రెట్టింపయింది.

చూస్తుండగానే చీకటి పడింది. నెగడు కోసం పుల్లలు ఏరుతున్న శంకు, కేశవసనులకు చెట్ల చాటున నక్కి నక్కి వీళ్ళ వైపే చూస్తున్న ఒక బాలుడు కనిపించాడు. కాలికి దెబ్బ తగిలి కుంటుతూ ఉన్న వాడిని పట్టుకుని బుజ్జగిస్తూ తీసుకువచ్చారు. వాడిని అష్టకుడు తన పక్కనే కూర్చోపెట్టుకుని అనునయంగా మాట్లాడుతూ వివరాలు ఆరా తీశాడు. వాడి కాలికి చికిత్స చేశాడు.

నెగడు అంటించారు. ఆ బాలుడు తేరుకున్నాడు. అందరు తలా కొన్ని రొట్టె ముక్కల్ని తిని నీళ్ళు తాగారు.

ఆ బాలుడి పేరు మత్త. వాడు తన కథ చెప్పడం ఆరంభించాడు. తాటక హత్య జరిగిన రోజు మత్త అక్కడే సమీపంలో ఆవాసంలో ఉన్నాడు. ఒకరోజు క్రితమే చెట్టుపై నుండి పడడంతో కాలు విరిగి పూర్తిగా నడవలేని స్థితిలో ఉన్నాడు. ఆరోజు కోలాహలం విని అందరూ బయటకు వస్తుంటే మత్త తానున్న గుడిసె కంత లోంచి చూస్తూ ఉన్నాడు.

దీర్ఘ గడ్డంతో ఉన్న ఒక ముని, తన కన్నా వయసులో కొంచెం

పెద్దవాళ్ళయిన బాలురు ఇద్దరు కనిపించారు. పొడవాటి కత్తులు, బాణాలతో అందరిని చీల్చేయడం చూసి భయంతో వణికాడు. తాటక వనవాసుల హాహాకారాలు, తాటకను చంపిన తీరును చెపుతూ ఒక్కపెట్టున ఏడవసాగాడు.

దీర్ఘం తీసి ఏడుస్తూ ప్రతి వివరాన్ని పొల్లు పోకుండా చెప్తుండటం ఒక విషాధ పాటలాగా ధ్వనించింది. రాత్రిపూట దీనంగా మూలుగుతూ, గొంతెత్తి ఏడ్చే కుక్క అరపులా, ఎన్నటికీ తీరని వేదన ఒకటి వేణువు లోంచి జారుతున్నట్లు అనిపించింది.

అనతి కాలంలోనే అనేక మార్పులు చేర్పులు జరిగి అది తాటక గాధగా దాసుల నోళ్ళలో నానడం మొదలయింది.

***

సిద్ధాశ్రమానికి వెళ్ళి అక్కడ హోమ గుండాన్ని, చెల్లా చెదరయిన శవాల్ని చూశారు. అందరిని ఖననం చేశారు. వెనక్కి తిరిగి వచ్చారు. జాబాలి అప్పగించిన పనిమీద కేశవసనుడు దూరప్రాంతాలకు వెళ్ళాడు. వివాహ ప్రస్తావన చేయబోయి అష్టకుడి మన:స్థితిని చూసి అపరాతల పర్వత పాదం వైపు వెళ్ళింది కాణవి. శంకుని బలవంతంగా శరదండా నది తీరానికి పంపాడు.

మత్తను మాత్రం వదలలేదు అష్టకుడు. వాడి జీర గొంతులోంచి అడవి పాటలు వినవలసిందే. మత్త కూడా అష్టకుడిని ఒక్క క్షణం వదిలి ఉండేవాడు కాదు.

అష్టకుడి వద్దకు వచ్చే దాసులు మత్తతో తాటకకు సంబంధించిన ఒకటో రెండో చరణాలు పాడించుకునే వాళ్ళు.

తాటకను ఎన్నడూ చూడని వాళ్ళు, ఆ తెగతో ఏ మాత్రం

సంబంధం లేని వాళ్ళు సైతం ఆమెను తమ మనిషిగా, తమకెంతో సన్నిహితులైన శక్తిగా భావించుకునే వాళ్ళు. బయటకు ఎవరూ పాడేవారు కాదు. ఏదీ జరుగుతున్నట్లు ఉండేది కాదు. కాని తాటక గాథ గాలితో కలిసి వారిని ఆవహిస్తున్నట్లు ఉండేది.

అదే సమయంలో తాటక వధ పేరుతో చెక్క బొమ్మల ప్రదర్శనలు, జానపద అభినయ గేయాలు ప్రచారంలోకి రావడం మొదలయింది. తాటక వేషధారి పెద్దపెద్ద కృత్రిమ స్థనాల్ని, పిరుదుల్ని ధరించి, దేహమంతా నలుపు రంగు పూసుకుని, కోరపళ్ళతో, ఎర్రటి నాలుకతో భయంకరంగా కనిపించేవాడు. చాలా వినోదం కల్పించేవాడు. ఆర్యగణ పెద్దలకోసం, పురోహిత వర్గ ప్రముఖుల కోసం ప్రత్యేక ప్రదర్శనలు ఏర్పాటు చేసేవారు. రాముని వీరత్వం వారిని తన్మయులను చేసేది. గురువుతో కలిసి ఒంటరిగా వెళ్ళిన రాజకుమారులిద్దరు రాక్షస సంహారం చేసిన వైనం కోసలలోనే కాదు పరిసర రాజ్యాలలోను ప్రసిద్ధి పొందింది.

అయితే ఒక రోజు అష్టకుడు అకస్మాత్తుగా అదృశ్యమయ్యాడు. అదేరోజు మత్త నాలుకను బహిరంగంగా కోసేశారు. నాలుకను కోసి వేస్తూ తలారీ ఇలా అన్నాడు –

“వీడు రాక్షస మాయను వెదజల్లుతున్నాడు. ఇలాంటి వాళ్ళ వల్ల అధర్మం ప్రబలుతోంది. అధర్మం వల్ల రోగాలు, అకాల మరణాలు సంభవిస్తున్నాయి. న్యాయాధీశుడి ఆజ్ఞ ఇది. ఈ కుర్రవాడి తప్పేమి లేదు. వీడి నాలుక మీద రాక్షసి కూర్చుంది. అందుకు ఈ శిక్ష తప్పడం లేదు” అన్నాడు.

తరువాత వాడు ఏమయ్యాడో తెలియదు. అష్టకుడు ఏమయ్యాడో తెలియదు. అతనితో చివరిసారి మాట్లాడింది మాత్రం న్యాయాధీశుడని

ఒకరిద్దరికి మాత్రమే తెలుసు. అతడన్నాడు

"అష్టకా! నీవు ఇంద్రపూజను నిరసిస్తావు. దేవున్ని నిరాకరిస్తావు. మా రక్తం కుత కుత ఉడుకుతున్నా విని ఊరుకుంటాం. అయితే మన చేతుల్లో దిక్కు లేని చావు చచ్చిన వాళ్ళ వీరగాథలు పాడుతుంటే... వాటి పరిణామాలు ఎటువైపు దారి తీస్తాయో తెలుసా నీకు?... ద్రోహి... పరాజితుల గాథలు కీర్తించడం ప్రమాదాల్లో కెల్లా ప్రమాదం..." అంటూ పక్కనున్నవారికి సైగ చేశాడు న్యాయాధీశుడు.

**సమాప్తం**



**Thataka**
novel by
Bejjarapu Ravinder

విరుద్ధమైన భావజాలాలు, భిన్నమైన రాజకీయ, ఆర్థిక, సాంకేతిక సమూహాల మధ్య ఆధిపత్యం కోసం, ఆత్మరక్షణకోసం జరిగే పోరు మహాభారత, రామాయణాలలో విరివిగా కనిపిస్తాయి. తాటక ఇతివృత్తంగా గల ఈ నవల చారిత్రక పరిణామాలను సంయమనంతో వివరిస్తుంది. "పరాజితుల గాథలు కీర్తించడం ప్రమాదాల్లో కెల్లా ప్రమాదం" అంటూ ముగిసే ఈ నవల ఉత్కంఠభరిత కథనంతో మనల్ని అయోధ్య నుండి గంగా సరయు సంగమాన్ని దాటించి తాటకవన భూముల్లో సంచరించిన అనుభూతిని కలిగిస్తుంది.

